విసురుతూ వినోదించే ఓ కొత్త ఆట...

# ఫ్రిస్‌బీ



## ఉచితం

ఫ్రిస్‌బీ! ప్రతి 500 గ్రాముల చాక్లెట్ కాంప్లాన్ డబ్బా కొన్నప్పుడు

**కాంప్లాన్®**

సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం




పచ్చ, నీలం, ఎరుపు, పసుపు... రకరకాల రంగుల ఫ్రిస్‌బీ. మజామజాగా విసురుతూ ఆడే కాంప్లాన్ ఫ్లయింగ్ ఫ్రిస్‌బీ

ఇప్పుడు ఎన్నికచేసిన ఊళ్ళలోనే దొరుకుతోంది.

GL/13 C/173 TEL

చందమామ
హెయిర్-ఎ-టాయ్
పథకం

# చందమామ పాఠకులకు ప్రత్యేక కానుక!







A రాబిట్
సైజు : 13.5 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 83-00
అదనం : రూ. 4-80 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 8-30 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

B టెడీ
సైజు : 10.5 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 93-00
అదనం : రూ. 5-35 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 9-30 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

C జంబో
సైజు : 7 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 68-00
అదనం : రూ. 3-90 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 6-80 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

D బౌవౌ
సైజు : 6 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 45-00
అదనం : రూ. 2-60 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 4-50 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

E ఫారర్ హేర్
సైజు : 6 అంగుళాలు (ఎత్తు) ధర : రూ. 25-00
అదనం : రూ. 1-45 తమిళనాడు లోపల జనరల్ సేల్స్‌టాక్స్
రూ. 2-50 తమిళనాడు వెలుపల సేల్స్‌టాక్స్

మా తరవాతి సెట్టులో, ఆనంద కుందేలుకుటుంబాన్ని పూర్తిచేయడానికి మామాహేర్, బేబీహేర్ రానున్నాయి!

మీరంటే మాకెంతో అభిమానం. అందుకే మీకోసం ఒక ప్రత్యేక కానుకను ఏర్పాటు చేశాం. మా బొమ్మలను మొట్టమొదట పొందే అవకాశం కూడా మీకే వుంటుంది. మీరు ఆశించే విధంగానే ధరలోనూ ప్రత్యేకరాయితీ వుంటుంది. మీరు పొదుపుచేయడానికి ఇంకొక మార్గం కూడా వున్నది. ఈ బొమ్మలు ఆర్డర్ చేయడం ద్వారా చందమామ చందాలలో రాయితీ పొందవచ్చు. 12 సంచికలకు 6 రూపాయలు తగ్గింపు! 24 సంచికలకు 15 రూపాయలు తగ్గింపు!









ప్రియమైన చందమామకు,

మీ 'మెయిల్-ఎ-టాయ్' పథకం గురించి చదివాను. బొమ్మల జాబితాను పరిశీలించాను.

దయచేసి వీటిని పంపండి (అవసరమైన వాటిపక్కన ✓ చేయండి).

* రేబిట్ * టెడి * జంబో * బౌ వౌ * ఫాదర్ హేర్

చందమామ చందాదారుగా చేరాలంటే దీనిద్వారా ప్రత్యేక తగ్గింపును కూడా పొందవచ్చని తెలిసింది.

నేను చందమామకు చందా పంపుతున్నాను :

* ఒక సంవత్సరం (36 రూపాయలకు బదులు 30 రూపాయలు)
* రెండు సంవత్సరాలు (72 రూపాయలకు బదులు 57 రూపాయలు)
* క్షమించండి. చందా తగ్గింపుపట్ల ఆసక్తి లేదు.

దీనితోపాటు, చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్ పేరు మీదుగా తీసిన రూ.........పోస్టల్ ఆర్డర్/మనిఆర్డర్ పంపుతున్నాను.




Note : This offer is valid only up to 30-6-1990.

మీరు చేయవలసిందల్లా, ఇక్కడి కూపన్‌ను పూర్తిచేసి, మాకు—
చందమామ టాయ్ ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్, చందమామ బిల్డింగ్స్, 188, ఎన్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు—600 026 చిరునామాకు పంపడం మాత్రమే. ఈ కూపన్ మాకు చేరిన ఒకనెల లోగా మీకు మా బొమ్మలు అందుతాయి. ఒకవేళ మీకు ఆ బొమ్మలు సంపూర్ణతృప్తిని కలిగించలేదంటే, ఒక వారం లోగా వాటిని మాకు పంపినట్టయితే, ధర మొత్తాన్ని మీకు తిప్పి పంపగలమని హామీ ఇస్తున్నాము.

గమనిక : కూపన్‌లో ఉన్న బొమ్మల జాబితాను పరిశీలించి, వాటిలో మీకు కావలసిన బొమ్మ/బొమ్మలు ఏవో వాటిపక్కన టిక్ (✓) మార్క్ చేసి సూచించండి. తరవాత, మీ పూర్తి చిరునామాను స్పష్టంగా రాసి, బొమ్మ(ల) ధరను పోస్టల్ ఆర్డర్ ద్వారా పంపుతున్నారో, మని ఆర్డర్ ద్వారా పంపుతున్నారో తెలియజేయండి. దయచేసి బొమ్మల సరైన ధరను పంపండి. మీ ఆర్డరను పరిశీలించి, పంపడంలో చిక్కులు రాకుండా వుండడానికే ఈ సూచన. ఈ ముఖ్య అంశాలను స్పష్టం చేయకుండా కూపన్లను పంపినవారు, మళ్ళీ విడిగా ఈ వివరాలను మాకు తెలియజేయాలి. అప్పుడే వారికి త్వరగా బొమ్మ(లు) పంపడం సాధ్యమవుతుంది.






# CUDDLES

Manufactured in technical collaboration with
Sammo Corporation. South Korea.

**చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్**
'చందమామ బిల్డింగ్స్'
**188, ఎన్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు – 600 026**



చందమామ మెయిల్-ఎ-టాయ్ పథకం

ఒక నెలలోగా బొమ్మ(లు) అందగలద(వ)ని ఆశిస్తున్నాను. ఒకవేళ బొమ్మలు నచ్చకపోతే వాటిని ఒక వారంలోగా తిప్పి పంపితే, ధర పైకాన్ని తిరిగి పొందవచ్చని గ్రహించాను.

నా పేరు : ______________ పుట్టిన తేదీ : ______________

చిరునామా : ______________

______________

నా అభిమాన విషయం : ______________

పత్రికలు/కామిక్స్ : ______________

టి. వి. కార్యక్రమాలు : ______________ బొమ్మలు ______________

వినోదాలు ______________ : చదవడం/బొమ్మలు/ఆటలు/టీవీ/వీడియో/వీడియో గేమ్స్/ఇంకేమయినా వుంటే రాయండి.



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## సాహస బాలలకు సత్కారం!

రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా సాహస బాలలు కొందరికి సత్కారం జరిగింది. సత్కారం పొందిన బాలబాలికలలో ప్రతి ఒక్కరూ, ఎదుటి వారిని అపాయం నుంచి రక్షించడానికి, తమ భద్రతను కూడా లెక్కచేయకుండా, ఆపత్సమయంలో సాయపడినవాళ్ళే.

గుంపులో నిలబడి నినాదాలు చేయడం, ధైర్యంగా మాట్లాడడం, కావాలంటే కార్యాచరణకు దిగడం సులభం. ఎందుకంటే అలా చేయడం ద్వారా ఏదైనా అపాయం కలిగితే, దానిని ఎదుర్కోవడానికి పక్కనే పదిమంది వున్నారన్న ధైర్యం వుంటుంది. అయితే, ఒంటరిగా సాహస కృత్యానికి పూనుకోవడానికి ఎంతో ధైర్యం కావాలి. తెగింపు కావాలి, నిస్వార్థంగా ఎదుటివారిని ప్రేమించగల సాహసశీలురే అలాంటి తెగువను ప్రదర్శించగలరు.

బాలబాలికలలో ధైర్య సాహసాలను పెంపొందించడానికి ఇలాంటి సత్కారాలు ఎంతయినా దోహదం చేస్తాయి. సత్కారం అందుకున్న బాలలందరినీ అభినందిస్తున్నాము.

సంపుటి 86 ఫిబ్రవరి '90 సంచిక 2

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00



వార్తలు-విశేషాలు:

# పనామాపై దాడి

పనామానాలో సైనిక నియంతృత్వపాలనను సాగించిన జనరల్ అంటొనియో నోరియేగాను పదవినుంచి తొలగించడానికి గత డిసెంబర్ 20 వ తేదీన అమెరికా దాడి జరిపింది!

నోరియేగా ఆధ్వర్యంలోనే జరిగిన ఎన్నికలలో ప్రతిపక్షనాయకుడు ఎండారా విజయం సాధించాడు. కాని, అతణ్ణి అధికారానికి రానివ్వకుండా నోరియేగా అడ్డుపడి, తనే అధికారపీఠాన్ని పట్టుకు కూర్చున్నాడు.

నోరియేగా చేసింది అపరాధమే. అయినా, పరాయి దేశం అంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకునే హక్కు అమెరికాకు లేదని దాదాపు ప్రపంచ దేశాలన్నీ అమెరికాను విమర్శించాయి.

నోరియేగా కేవలం నియంతమాత్రమే కాదు. గత ఆరేళ్ళుగా తనను వ్యతిరేకించిన వాళ్ళందరినీ దారుణంగా హింసించాడు. తన అధికారాన్ని నిలుపుకోవడానికి ప్రపంచంలోని యువతీయువకుల జీవితాలను నరకప్రాయం చేసే మాదక ద్రవ్యాల అక్రమ రవాణాలో కోట్లాదిధనం ఆర్జించాడు—అందుకే అమెరికా ఈ చర్యకు పూనుకున్నదని అమెరికా మద్దతుదార్లు అభిప్రాయ పడుతున్నారు!



మధ్య అమెరికాలోని ఏడు దేశాలలో పనామా ఒకటి. గోటెమాలా, ఎల్‌సాల్వెడార్, హాన్డురాస్, నికరాగువా, కోస్టారికా, బెలీజ్—ఇవి మిగతా ఆరు దేశాలు. ఉష్ణమండల వర్షపాతం గల పచ్చటి అడవులమధ్య అక్కడక్కడా అప్పుడప్పుడూ రగిలే అగ్ని పర్వతాలు గల చిన్న అందమైన దేశం పనామా. అంతర్జాతీయ సముద్రమార్గంలో పనామా కాల్వ కీలకపాత్ర వహిస్తున్నది. అయినా అక్కడి 20 లక్షలమంది ప్రజలు సుఖశాంతులతో జీవించడం లేదు. రాజకీయవాదుల పరస్పరఘర్షణల కారణంగా తరచూ ఒత్తిడికీ, బాధలకూ లోనవుతున్నారు.

మాదకద్రవ్యాలపీడను అరికట్టడానికి ప్రపంచ దేశాలన్నీ పాటుపడాలి. లేకుంటే, యువతీయువకులే కాదు; ప్రభుత్వాలే పతనంకాగల వనడానికి పనామా ఉదంతం ఒక హెచ్చరిక!

## చందమామ కబుర్లు




### ప్రపంచంలోకెల్లా సంపన్నులు

తలసరి ఆదాయం ప్రకారం చూస్తే ఈనాడు స్విట్జర్లాండ్‌లోనే ప్రపంచంలోకెల్లా ఎక్కువ మంది ధనికులు వున్నారు. ప్రపంచ బ్యాంక్ ఇటీవలి నివేదికలో ఈ విషయాన్ని తెలియజేసింది.

### భూకంపం హెచ్చరిక!

లాస్ ఏంజెల్స్‌లో ముగ్గురు మిత్రులు కలిసి, ఒక చిన్న యంత్రాన్ని రూపొందించారు. ఈ యంత్రాన్ని ఇంట్లో అమర్చినట్టయితే, భూకంపం రావడానికి ముందు కంపనాలను రికార్డుచేసి, హెచ్చరికగా శబ్దం మోగేలా చేస్తుంది. త్వరలో ఈ యంత్రాలు సరసమైన ధరకు లభించనున్నాయి.





# అమ్మవారి చీరెలు

ఒక నగలవ్యాపారి దుకాణంలో పనిచేసే, గోవర్ధనుడనే అతడి ఉద్యోగం హఠాత్తుగా పోయింది. లక్షలు గడించిన అతడి యజమాని, సముద్రవ్యాపారం మీది మోజుతో, కుటుంబంతో సహా, ఊరు విడిచి వెళ్ళిపోయాడు.

వ్యాపారి వెళ్ళేముందు, గోవర్ధనుడి చేతిలో వెయ్యివరహాలు పెట్టి, "ఇన్నాళ్ళూ నా దగ్గిర నమ్మకంగా పని చేసినందుకు, ఈ డబ్బు నీకిస్తున్నాను. ఇక నీదారి నువ్వు చూసుకో!" అని చెప్పాడు.

ఉద్యోగం పోయినందుకు చెప్పరానంతగా విచారపడుతూ, ఇల్లు చేరిన గోవర్ధనుడితో, అతడి భార్య గోమతి, "జరిగిన దానికి విచారపడవలసిందేమీలేదు. మీ యజమాని ఇచ్చిన ఈ వెయ్యివరహాలతో మనం సొంతవ్యాపారం ప్రారంభిద్దాం," అన్నది.

"సొంతవ్యాపారమా! ఏమిటది?" అని అడిగాడు గోవర్ధనుడు.

"నువ్వు సోమపురం నుంచి మంచి జరీ వున్న రంగుచీరెలూ, తెల్లచీరెలూ కొనుక్కురా. నీళ్ళలో తడిసినా వెలవని రంగులూ, కుంచే తీసుకువస్తే, ఆ చీరెల మీద నేను అందమైన పువ్వులూ, లతలూ చిత్రీకరిస్తాను. అప్పుడవి ఎంతో కొత్తగా, ప్రత్యేకమైనవిగా కనిపించి, పట్నంలో మంచి ధరకు అమ్ముడుపోతాయి," అన్నది గోమతి.

భార్య చెప్పినట్టే, వారం తిరక్కుండా గోవర్ధనుడు చీరెలు తెచ్చాడు. వాటి మీద పువ్వులూ, లతలూ చిత్రించింది గోమతి.

ఈ కొత్తరకం చీరెలకు ఏదైనా మంచి పేరొకటి పెట్టాలని, గోమతి ఆలోచించింది. అయితే, సమయానికి నచ్చిన పేరేదీ ఆమెకు తట్టలేదు.

మాచిరాజు కామేశ్వరరావు



"తీరుబడిగా ఈ చీరెలకు ఏం పేరు పెట్టాలో ఆలోచిస్తాను. పట్నం తీసుకు పోయావంటే, కొత్తతరహాగా వున్న ఈ చీరెలు వెంటనే అమ్ముడు పోతాయి," అన్నది భర్తతో గోమతి, చీరెలను ఒక మూటగా కడుతూ.

పట్నంలో గోవర్ధనుడు తీసుకువెళ్ళిన చీరెలను, జనం ఎంతో ఆసక్తిగా చూశారు. అయితే, వాటిమీది బొమ్మలు ఉతకగానే పోతాయనే భయంతో, వాటిని ఎవరూ కొనలేదు. అతడు సాయంకాలంవరకు తిరిగినా, ఒక్క చీర కూడా అమ్ముడు కాలేదు. ఉసూరుమంటూ గోవర్ధనుడు తిరుగుప్రయాణమయ్యాడు.

గోవర్ధనుడు తమ గ్రామానికి దాపుల నున్న, ఒక ఊరిప్రాంతం చేరేసరికి, రాత్రి చాలా పొద్దుపోయింది. అతడు ఆ పైన నడవలేక కాసేపు విశ్రాంతి తీసుకుందా మని, దాపులనున్న అమ్మవారిగుడి అరుగు మీద కూర్చున్నాడు.

ఒక అరగంట తర్వాత గోవర్ధనుడు అరుగు దిగి, చీరెలమూటను నెత్తిన పెట్టు కుంటూ ండగా, "మూటలో మంచి, మంచి చీరెలున్నవే!" అంటూ అమ్మవారు ప్రత్యక్షమైంది.

గోవర్ధనుడు ఒక తృటికాలం నివ్వెర పోయి, ఆ తరవాత తేరుకుని, ఎంతో వినయంగా, "అవును, తల్లీ! అమ్మడానికి పట్నం తీసుకువెళ్ళాను. నా దురదృష్టం! ఒక్కగానొక్కటైనా అమ్ముడు పోలేదు," అన్నాడు.

"అలాగా! ఏవీ నేను చూస్తాను," అన్నది అమ్మవారు.

గోవర్ధనుడు మూట విప్పి, ఒక్కొక్క చీరెనూ అమ్మవారికి చూపించసాగాడు.

"ఈ రంగు నాకు ఇష్టం. ఈ పువ్వులు బావున్నాయి. ఈ జరీ నాకు నచ్చింది," అంటూ అమ్మవారు చీరెలన్నిటినీ ఒక పక్కగా పెట్టింది.

తర్వాత ఆమె తన చీరె కొంగుకున్న చిరుగులను, గోవర్ధనుడికి చూపుతూ,

''పూజారి, ఈ చిరుగుల చీరె నాకు కట్టబెట్టి, వారం కావస్తున్నది. బట్టలు మంచివి లేనందున, భక్తుల ఎదలు చిరాకుగా వుంటున్నవి. నువ్వు తెచ్చిన చీరెలు చూస్తుంటే, ఎంతో హాయి అని పిస్తున్నది,'' అన్నది.

''అదేం, తల్లీ! భక్తులు నీకు ఎన్నో చీరెలు కానుకగా యిచ్చి పోతూంటారు గదా!'' అన్నాడు గోవర్ధనుడు.

''వాళ్ళు కానుకగా ఇచ్చినవాటిలో, మంచివన్నీ, పూజారి గయ్యాళి భార్య తన సొంతం చేసుకుంటుంది. ఇక పూజారి నాకు కట్టబెట్టేవి నాసిరకం చీరెలు. ధర్మకర్తకు అతడు, భార్యవైపు చుట్టం కావడంతో, ఆయన పూజారిని గుడ్డిగా నమ్మి, గుడి బాధ్యత అప్పగించాడు,'' అన్నది అమ్మవారు.

గోవర్ధనుడు, అమ్మవారికి నమస్కరించి, ''మా చీరెలు నువ్వు తీసుకోవడం, మా అదృష్టం, తల్లీ! ఇక వెళతాను,'' అంటూ అక్కడి నుంచి లేచి కదలబోయాడు.

''అగాగు! చీరెల డబ్బు మరిచావా? రేపు ఉదయానే ధర్మకర్త ఇంటికి వెళ్ళి—అమ్మవారు నా దగ్గిర రెండువేల వరహాల ఖరీదు చేసే చీరెలు బేరం చేసి కొన్నారు; ఆ డబ్బు యివ్వండి, అని అడుగు. అందువల్ల నీకూ, కొంతవరకు నాకూ తప్పక మేలవుతుంది,'' అన్నది అమ్మవారు.





గోవర్ధనుడు పట్టరాని సంతోషంతో ఇల్లు చేరాడు. సంగతి విన్న గోమతి చాలా ఆనందపడింది. ఆ రాత్రి తెల్లవారే వరకూ, ఆ భార్యాభర్తలిద్దరికీ కంటిమీద కునుకులేదు.

తెల్లవారుతూనే గోవర్ధనుడు, గుడి ధర్మకర్త ఇంటికి వెళ్ళి, ఆయనకు అమ్మవారు చెప్పమన్నట్టుగానే చెప్పాడు.

ధర్మకర్త గోవర్ధనుణ్ణి నఖశిఖపర్యంతం, ఒకసారి పరీక్షగా చూసి, "నీకేమన్నా మతిపోయిందా? అమ్మవారు నీ దగ్గిర చీరెలు కొనడం ఏమిటి? అసలు ఆ తల్లి నీ కంటబడడమా! ఛీ, పో యిక్కణ్ణించి," అన్నాడు ఆగ్రహంతో.

గోవర్ధనుడు చిన్నగా నవ్వుకుని, "అయ్యా, పూజారి పుణ్యమా అని, అమ్మవారు తనకు కావలసిన చీరెలేవో, తానే స్వయంగా కొనుక్కోవలసి వచ్చింది. ఏం చేయగలం, అంతా కలిమహిమ!" అన్నాడు వ్యంగ్యంగా.

ఆ జవాబు విని ధర్మకర్త విసుక్కుంటూ, అప్పటికప్పుడే పూజారి ఇంటికేసి బయలు దేరాడు. పూజారి ఇల్లు గుడికి దాపులనే వున్నది. గోవర్ధనుడు, ధర్మకర్త వెనగ్గా నడిచాడు.

తెల్లగా తెల్లవారిపోయినా, పూజారి యింకా నిద్రపోతూనే వున్నాడు. ధర్మకర్త కేక విని అతను తలుపు తెరిచి బయటికి వచ్చాడు.

ధర్మకర్త, గోవర్ధనుణ్ణి అతడికి చూపుతూ, "ఇతనొక చీరెల వ్యాపారి. అమ్మవారు తన దగ్గిర రాత్రి రెండువేల వరహాల విలువచేసే చీరెలు కొన్నట్టు చెపుతున్నాడు. ఈ సంగతి నీకేమైనా తెలుసా?" అని అడిగాడు.

"అమ్మవారేమిటి, స్వయంగా చీరెలు కొనడమేమిటి? అపచారం! అపచారం! వీడెవడో రాటుతేలిన దొంగయినా అయి వుంటాడు; లేక ఊళ్ళు పట్టుకు తిరిగే వెర్రివాడైనా అయివుంటాడు," అన్నాడు పూజారి కోపంగా.

ధర్మకర్త చిరాగ్గా గోవర్ధనుడి కేసి చూసి, పూజారితో, "ఏ సంగతీ తేలి పోతుంది. ముందు మీరు గుడి తలుపులు తెరవండి." అన్నాడు.

పూజారి గుడి తలుపులు తెరవగానే, అమ్మవారి కాళ్ళ దగ్గిర చీరెల మూట కనిపించింది. ఆమె చిరుగులు పడిన పాత చీరె కట్టుకుని వున్నది.

ధర్మకర్త, పూజారి కేసి తీవ్రంగా చూస్తూ, "నిన్న సాయంత్రం, మా అమ్మా యిని అత్తవారింటికి పంపేటప్పుడు, అమ్మవారికి కానుకగా జరీపట్టు చీరె సమర్పించాం. దానిని రాత్రి పూజా సమ యంలో అమ్మవారికి అలంకరిస్తానన్నావు. మరి ఇప్పుడు ఆ చీరె ఏమయింది?" అని అడిగాడు.

పూజారి వణికిపోతూ తల వంచు కున్నాడు.

గోవర్ధనుడు కల్పించుకుని, ధర్మ కర్తతో, "అయ్యా, తమరు పూజారిగారి భార్య నడగవలసిన ప్రశ్నను, పూజారి నడుగుతున్నారు. పాపం, ఆయన ఏమని జవాబివ్వగలడు!" అన్నాడు.

కొద్దిసేపు ఆలోచించిన మీదట ధర్మ కర్తకు, పూజారి అక్రమప్రవర్తన అర్థమై పోయింది. ఆయన అప్పటికప్పుడే పూజారిని తొలగించి, గోవర్ధనుడికి రెండు వేల వరహాలిచ్చి, ఎంతో మర్యాదగా సాగనంపాడు.

ఈ జరిగిన సంగతి క్షణాల మీద, ఆ గ్రామంలోనే కాక చుట్టుపక్కల వున్న గ్రామాల్లో కూడా తెలిసిపోయింది. ప్రజలు తండోపతండాలుగా అమ్మవారి గుడికి వచ్చి, పూజలూ, ప్రార్థనలూ చేయసాగారు. కొందరు స్త్రీలు గోవర్ధనుడి ఇంటికి వెళ్ళి, అమ్మవారి చీరెలు కావాలంటూ అడిగారు.

గోమతి చాలా సంతోషించి, గోవర్ధను డితో, "మన చీరెలకు పేరుపెట్టే శ్రమ తప్పింది. ప్రజలే వాటికి అమ్మవారి చీరెలని పేరు పెట్టారు. కష్టపడి పని చేసే మనకు, ఆ తల్లి దయవల్ల ఇక ఏలోటూ వుండదు!" అన్నది.



# పరీక్ష

ఇంటికి అవసరం అయిన వస్తువులు కొనుక్కురావడానికి, భగవంతం అంగడికి వెళ్ళాడు. అక్కడ చాలామంది జనం మూగివున్నారు. వాళ్ళందరూ వెళ్ళేదాకా ఆగి, భగవంతం అంగడి యజమానికి తనకు కావలసిన వస్తువుల పేర్లు చెప్పాడు.

అంగడి యజమాని, భగవంతానికి వస్తువులన్నీ యిచ్చి, వాటి మొత్తం ఖరీదు ఎంత అయిందో చెప్పాడు. భగవంతం డబ్బు యివ్వగానే, అంగడి యజమాని వాటి ఖరీదు తీసుకుని మిగతా చిల్లర యిచ్చాడు.

భగవంతం ఆ డబ్బు లెక్కచూసుకుని ఆశ్చర్యపోయాడు. అంగడి యజమాని పొరబాటున పది రూపాయిలు ఎక్కువిచ్చాడు. అతడు, ఆ డబ్బును అంగడి యజమానికి ఇస్తూ, "పొరబాటున పది రూపాయిలు ఎక్కువిచ్చారు. డబ్బు విషయంలో జాగ్రత్తగా వుండాలి!" అని వెళ్ళబోయాడు.

అంగడి యజమాని భగవంతాన్ని ఆపి, "మీరు పొరబాటున వందరూపాయలకు బదులు రెండు వందల రూపాయి లిచ్చారు. డబ్బంటే ఏమాత్రం లెక్కలేనివాళ్ళు కొందరు, ఇలాంటి పొరబాట్లు చేస్తూంటారు. అలాంటి డబ్బు తిరిగియివ్వడంకన్న, ఏ పేదవాడికో దానం చేయడం మేలు. ఇలా అనుకుని మిమ్మల్ని పరీక్షించాను. నేను ఎక్కువిచ్చిన, ఆ పది రూపాయలూ తీసుకుని, మీదారిన మీరు వెళ్ళివుంటే, నేను మీరు అధికంగా యిచ్చిన వంద రూపాయిలూ మీకు యిచ్చివుండేవాణ్ణికాను. ఇప్పుడు మీ నిజాయితీ నాకు సంతోషం కలిగించింది. మీ వంద రూపాయిలూ మీరు తీసుకోండి," అంటూ వంద రూపాయిలు యిచ్చేశాడు.

—దాసరి వెంకటరమణ






## 6

[సేనాధిపతి వీరసింహుడు సుమేధరాజ్య సింహాసనాన్ని ఆక్రమించాడు. రాజుకూ, రాజ కుటుంబానికీ ఏమయిందో చెప్పమని ప్రశ్నించిన ఒక యువకుణ్ణి భటులు బంధించారు. వీర సింహుణ్ణి రాజుగా అంగీకరించడానికి తిరస్కరించిన వృద్ధమంత్రిని హతమార్చడానికి ఏర్పాట్లు జరిగాయి. కాని, సమయానికి ఒక మర్మవీరుడు వృద్ధమంత్రిని రక్షించాడు. తరవాత—]

మరునాడు సూర్యోదయం వేళ వీరసింహుడు రాజోద్యానంలో, శాంతిదేవుడి నడకను అనుకరిస్తూ అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. అయినా, శాంతిదేవుడి నడకలోని హుందాతనం అతనికి అబ్బలేదు. సూర్యోదయ సమయంలో ప్రకృతి సౌందర్యాన్ని తిలకించడంలో శాంతిదేవుడు పరమానందం చెందేవాడు. ఆయన ప్రకృతిని ప్రేమించేవాడు. పైగా ఆయన హృదయంలో ఏ కోశానా భయం అన్నది వుండేది కాదు. అందుకే ఆయన నడకలో నిండుదనం వుండేది; గాంభీర్యం ఉట్టిపడేది. అయితే, వీరసింహుడికి ప్రకృతి పట్ల ప్రేమలేదు. ప్రకృతేమిటి? తన్ను తాను ప్రేమించడం తప్ప ప్రపంచంలో మరెవరి మీదా అతనికి ప్రేమలేదు. పైగా, ఏ క్షణాన ఎటువైపు నుంచి ఏ అపద ముంచుకొస్తుందో అన్న భయం! తను



"అసలు జరిగిందేమిటో చెప్పు!" అని గద్దించాడు వీరసింహుడు.

కొత్వాలు చుట్టుపక్కల కలయజూసి, సమీపంలో ఎవరూ లేరని నిర్ధారించుకుని, "వృద్ధమంత్రి మన భటులనుంచి ప్రాణాలతో తప్పించుకున్నాడు ప్రభూ!" అన్నాడు.

"ఏమిటీ! మంత్రి తప్పించుకున్నాడా? అంటే నువ్వాపనికి మేకలను పంపావన్నమాట! ఇంతకీ ఎలా తప్పించుకున్నాడట ఆ ముసలిమంత్రి?" అని అడిగాడు వీరసింహుడు చాలా కోపంగా.

"ఆ విషయం తెలియజేయడానికి భటులు ప్రాణాలతో లేరు ప్రభూ! వాళ్ళు ముగ్గురూ హతులైపోయారు." అన్నాడు కొత్వాలు మెల్లగా.

"ఛీ....ఛీ....మేకలను కాదు; గొర్రె పిల్లలను పంపావు!" అని అరిచాడు వీరసింహుడు పట్టరాని ఆవేశంతో.

"ప్రభువులు క్షమించాలి. ఏంజరిగిందో తెలియదుగాని, తెల్లవారేసరికి నగరం పొలిమేరలో భటులు ముగ్గురూ చచ్చిపడివున్నారు. అయితే ఒకటి మాత్రం ఖాయం. మన భటుల్ని మంత్రి చంపలేదన్నది నిజం. ఎందుకంటే మంత్రి కత్తి పట్టడం మనమెప్పుడూ చూడలేదు. అలాంటి వృద్ధమంత్రి, యోధులయిన

చంపలేకపోయిన శాంతిదేవుడు ఏమయ్యాడు? రాజ్యంలో తనను వ్యతిరేకించేవాళ్ళెందరున్నారు? వాళ్ళందరూ ఏకమై తనపై కుట్ర పన్నుతున్నారా? ఇలాంటి అనుమానాలతో అతడు అనుక్షణం లోలోపల భయపడసాగాడు. అందువల్ల అతని నడకలో నిలకడలేదు; హుందాతనం లేదు!

"మహాప్రభూ!" అని పిలిచాడు కొత్వాలు వీరసింహుణ్ణి సమీపించి.

"ఏమిటి?" అన్నట్టు తిరిగి చూశాడు వీరసింహుడు.

"జరగకూడనిది జరిగిపోయింది మహాప్రభూ!" అన్నాడు కొత్వాలు.

ముగ్గురు భటులను హతమార్చడంటే నమ్మశక్యంగా లేదు ప్రభూ! ఆపని వేరెవరో చేసి వుంటారు!'' అన్నాడు కొత్వాలు.

''ఎవరు చేశారంటావు?'' అని అడిగాడు వీరసింహుడు.

''అదే అంతుచిక్కడం లేదు. అసలు ఏం జరిగిందో తెలుసుకోవడానికి మన గూఢచారులను నియోగించాను!'' అన్నాడు కొత్వాలు క్షమాపణలు చెప్పుకుంటున్న ధోరణిలో.

వీరసింహుడు మౌనంగా కొంతసేపు ఒకేచోట నిలబడి, ఆ తరవాత పిడికిలి బిగించి, ''ఈ అపాయాన్ని మనం మొగ్గలోనే చిదిమివేయాలి. ముదరనిస్తే ప్రాణాలు తీస్తుంది. మనకు వ్యతిరేకంగా ఏదో కుట్ర జరుగుతున్నది. కుట్ర దారులందరూ ఏకమై తిరగబడేలోగా మనం వాళ్ళ అంతం చూడాలి. అవును....నిన్న మన భటులను, శాంతిదేవుణ్ణి గురించి ప్రశ్నించిన యువకుడెక్కడున్నాడు? వాడు కుట్రదారులలో ఒకడై వుంటాడు!'' అన్నాడు.

''ఆ యువకుడి పేరు వసంతుడు ప్రభూ! అయినా వాడు కుట్రదారుగా కనిపించడం లేదు ప్రభూ! అయితే రాజ్యాధికారాన్ని తమరు చేపట్టడం గురించి మాత్రం ఇంకా వ్యతిరేకిస్తూనే



వున్నాడు. శాంతిదేవుడి క్షేమం గురించి అడుగుతూనే వున్నాడు,'' అన్నాడు కొత్వాలు.

''పిచ్చిగా వాగకు. కుట్రదారు కాకుంటే, మన అధికారాన్ని వ్యతిరేకించే ధైర్యం ఒంటరిగాడికి ఎలా వస్తుంది? వాణ్ణి వేధించండి, నిజం కక్కుతాడు,'' అన్నాడు రాజు.

''వాణ్ణి అప్పుడే రకరకాల బాధలకు గురి చేశాం. కాని, ప్రయోజనం లేదు,'' అన్నాడు కొత్వాలు.

''అలా అయితే వాణ్ణి వెంటనే హతమార్చు. ఆ నీచుణ్ణి నగరవీధులగుండా వధ్యభూమికి లాక్కుపో. మన అధికారా

నికి ఎదురుతిరిగితే జరిగేదేమిటో నగర పౌరులందరికీ తెలిసిరావాలి. వాణ్ణి బహిరంగంగా ఉరి తీయించు. ఆ దెబ్బతో ప్రజలందరూ గడగడలాడి పోతారు!'' అని అజ్ఞాపించాడు వీరసింహుడు.

కొత్వాలు సరేనని అక్కడినుంచి వెళ్ళి పోయాడు.

రాజుకు ఎదురుతిరిగిన వసంతుడికి ఉరిశిక్ష విధించినట్టు అప్పటికప్పుడే చాటింపు జరిగింది. నగరాన్ని ఆనుకుని వున్న విశాలమైదానంలో అతణ్ణి ఉరి తీయడానికి తగిన ఏర్పాట్లు జరిగాయి.

ఆ రోజు మధ్యాహ్నం, కారాగారం నుంచి నగర వీధులగుండా వసంతుడి ఊరేగింపు బయలుదేరింది.

ఆ సమయంలో నగర ప్రజలందరూ తనను చూసి మెచ్చుకోవాలని, కొత్వాలు ముతకరంగు వింత దుస్తులు ధరించి, బలమైన గుర్రమెక్కి ఊరేగింపుకు ముందుగా, ''దూరంగా తప్పు కోండి....తప్పుకోండి,'' అని మాటిమాటికీ కేకలు వేస్తూ వెళ్ళాడు. వసంతుడికి విధించిన మరణశిక్ష చూసి నగరప్రజలు భయభ్రాంతులవుతారో లేదో గాని, తన గొప్పదనం చూసి అందరూ మెచ్చుకోవాలన్నది కొత్వాలు ఆకాంక్ష. అయినా, హఠాత్తుగా అప్పుడే పొగమంచు కురవడంతో, ప్రజలు కొత్వాలును స్పష్టంగా చూడలేకపోయారు. దాంతో అతనికి కాస్త ఆశాభంగమయింది.



కొత్వాలు ఎక్కిన గుర్రం వెనకగా, చేతులు బంధించబడిన వసంతుడూ, అతనికి ఇరువైపులా భటులూ నడిచారు. వాళ్ళకు వెనకగా ఆయుధాలు ధరించిన మరికొందరు భటులు నడుస్తున్నారు. వసంతుడు ఎలాంటి చలనమూ లేకుండా మౌనంగా నడుస్తున్నాడు.

దారికి అడ్డు ఎవరూ లేరు. కాని, ప్రజలదృష్టిని తన మీదికి ఆకర్షించడానికి కొత్వాలు, మాటిమాటికీ, ''దూరంగా తప్పుకోండి....దూరంగా వెళ్ళండి,'' అని అరవసాగాడు.

హఠాత్తుగా, ఎవరో కొత్వాలును గుర్రం పైనుంచి బలంగా తోశారు. అతడు దభీమని కిందపడి విలవిల తన్నుకోసాగాడు. మరుక్షణమే ఎవరో మెరుపులాంటి ఖడ్గ చాలనంతో, వసంతుడి చేతికి బంధించబడిన తాళ్ళను ఛేదించారు.

వసంతుడు వెనుదిరిగి చూశాడు. ముసుగు వీరుడొకడు, ''గుర్రమెక్కి నా వెనక కూర్చో,'' అని హెచ్చరిస్తూ, ఒక్క ఊపున కొత్వాలు గుర్రమెక్కి, కళ్ళాన్ని పట్టుకున్నాడు. వసంతుడు కూడా మరుక్షణమే ఒక్క గెంతున గుర్రంమీదికి లంఘించి, మర్మ వీరుడి పక్కన కూర్చున్నాడు.

గుర్రం శరవేగంతో వెళ్ళిపోయింది.

భటులు భయాశ్చర్యాలతో మాటా పలుకూ లేకుండా నిలబడిపోయారు. కొత్వాలు మూలుగు విని స్పృహలోకి వచ్చి,





పరిగెత్తిపోయి, అతన్ని మెల్లగా లేవనెత్తి కూర్చోబెట్టారు.

"నన్ను గుర్రంపైనుంచి కిందికి తోసిందెవరు? నా గుర్ర మెక్కడ?" అని అడిగాడు కొత్వాలు బాధగా.

"గుర్రం పారిపోయింది!" అన్నారు భటులు.

"పారిపోయిందా?" అని అడిగాడు కొత్వాలు నిస్పృహతో.

"ఖైదీ కూడా తప్పించుకున్నాడు," అన్నాడు మరొక భటుడు.

"ఖైదీ తప్పించుకున్నాడా! ఇంకేం నాపని కూడా అయిపోయినట్టే!" అన్నాడు కొత్వాలు బాధతో మూలుగుతూ.

ముసుగు వీరుడు అరణ్య మధ్యానికి చేరుకుని, ఒక గుహ ముఖద్వారం ముందు గుర్రాన్ని ఆపాడు.

ఇద్దరూ గుర్రంపైనుంచి కిందికి దిగారు.

"మీరేగాని రాలేదంటే ఈపాటికి నా ప్రాణాలు పోయేవి!" అన్నాడు వసంతుడు కృతజ్ఞతాభావంతో ముసుగువీరుడికి చేతులు జోడిస్తూ.

"నిజమే! అయినా నువ్వేం అపరాధం చేశావు? నీకెందుకు మరణశిక్ష విధించారు?" అని అడిగాడు ముసుగువీరుడు.

"శాంతిదేవ మహారాజు ఎక్కడున్నారు? రాత్రికి రాత్రే సేనాధిపతి రాజు ఎలా అయ్యాడు? అని చాటింపు వేసిన భటులను అడిగాను. అంతే! నా ప్రశ్నలకు సమాధానం ఇవ్వకుండా భటులు నన్ను బంధించారు. ఆపైన, రాత్రి ఎవరో అజ్ఞాత వ్యక్తులు, ముగ్గురు భటులను హతమార్చారట. వాళ్ళను హతమార్చినవారికీ, నాకూ సంబంధం వుందనీ, వీరసింహుడి అధికారాన్ని కూలద్రోయడానికి వాళ్ళతో కలిసి కుట్ర పన్నుతున్నాననీ నా మీద నిందారోపణ చేసి, మరణశిక్ష విధించారు," అన్నాడు వసంతుడు.

"అదిసరే, శాంతిదేవుడికి ఏమయితే నీకేం? ఆయనపై నీకెందుకింత అభి

మానం?'' అని అడిగాడు ముసుగు వీరుడు.

''శాంతిదేవ మహారాజు ప్రజలను కన్న బిడ్డల్లా పాలించిన కరుణామయుడు. అటువంటి ధర్మప్రభువుకు ఏమయిందో తెలుసుకోవడంమా కర్తవ్యం కాదా? పైగా, వీరసింహుడు పరమదుర్మార్గుడు. అధికారాన్ని చేపట్టిన క్షణంనుంచీ మితిమించిన గర్వంతో ప్రజలను హింసిస్తున్నాడు!'' అన్నాడు వసంతుడు.

''నిజమే. మనం ఆ దుర్మార్గుడి అంతం చూడాలి. అయితే, ఒంటరిగా కాదు; కలసికట్టుగా ఆ కార్యం సాధించాలి. వాడికి వ్యతిరేకంగా ఉన్న వారందరినీ మనతో కలుపుకోవాలి!" అన్నాడు ముసుగువీరుడు.

''రాత్రి ముగ్గురు భటులను హతమార్చింది మీరేనా?'' అని అడిగాడు వసంతుడు.

''అవును. అయినా, వాళ్ళను చంపాలన్న ఉద్దేశం నాకు లేదు. వాళ్ళు వృద్ధ మంత్రిని చంపబోయారు. ఆ క్షణంలో ఆయన్ను కాపాడాలంటే ఆ హంతకులను హతమార్చడం తప్ప నాకు మరో మార్గం కనిపించలేదు. అందుకే అలా చేశాను. అధికారుల ఆజ్ఞానుసారం నడుచుకునే అమాయకులను ప్రాణాలు తీయడమంటే నాకు చిరాకు. ఈ రోజు ఎవరి ప్రాణమూ తీయకుండా నిన్ను కాపాడగలిగినందుకు నాకెంతో ఆనందంగా వున్నది. పిరికి పందలే అమాయకులపై కత్తి దూస్తారు. మనం మహోన్నత కార్యం సాధించడానికి దీక్షబూని వున్నాము. అందుకే మనం ధైర్యంగా పోరాడాలి,'' అని చెప్పి ముసుగు వీరుడు గుహలోపలికి వెళ్ళి కొన్ని మధుర ఫలాలు తెచ్చి వసంతుడికి ఇచ్చాడు. ఆ తరవాత అరణ్యం నుంచి అమృతపురికి చేరుకునే దగ్గరి మార్గం తెలియజేసి. ''నువ్వు అమృతపురికి వెళ్ళి, నగరానికి పడమర సరిహద్దులో వున్న మహాకాళి ఆలయాన్ని చేరుకో. అక్కడ కలుసుకుందాం,'' అని చెప్పి, గుర్రంమీద ఎక్కి వెళ్ళిపోయాడు. —(ఇంకావుంది)





# మారువేషం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక దేశానికి పరిపాలకుడివైన నువ్వు, రాజ్యపాలనను ఎవడికో అప్పగించి, ఇలా శ్మశానంలో కాలం వెళ్లబుచ్చుతున్నావన్న అనుమానం కలుగుతున్నది. నా అనుమానమే నిజమైతే, నువ్వులేని సమయంలో సింహాసనాన్ని అధిష్ఠించినవాడు, నిజాయితీ పరుడు కాకపోతే తప్పక నిన్ను వంచించి లాభపడగలడు. ఇందుకు ఉదాహరణగా నందివర్ధనుడనే రాజు కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మణిమేఖలరాజు ధర్మచంద్రుడు, పేరుకు తగినట్టు ధర్మప్రభువు. అతడి

## బేతాళ కథలు



పాలనలో ప్రజలు ఎంతో సుఖజీవనం గడిపారు. ధర్మచంద్రుడు, వృద్ధుడయ్యాక, రాజ్యాన్ని తనకుమారుడైన నందివర్ధనుడికి కట్టబెట్టి విశ్రాంతిగా కాలం గడపాలని భావించాడు.

అయితే, నందివర్ధనుడికి తండ్రి నిర్ణయం చాలా యిబ్బంది కలిగించింది. అతడు అనాటివరకూ రోజులో ఎక్కువ కాలం రాజ్యపరిపాలనా వ్యవహారాలకు సంబంధించిన రాజకీయ, అర్థికశాస్త్రాలు చదువుతూ ఒంటరిగా గడుపుతూండేవాడు. తాను భవిష్యత్తులో ప్రజలకు ఎక్కువ మేలు కలిగించే పథకాలను గురించి తీవ్రంగా అలోచిస్తూండేవాడు. ఇక తప్పనిసరి కావడంతో అతడు పట్టాభిషేకానికి అంగీకరించాడు.

నందివర్ధనుడు రాజయినకొద్దికాలానికే, ధర్మచంద్రుడు మరణించాడు. నందివర్ధనుడు పరిపాలనా బాధ్యతలను సమర్థవంతంగానే నిర్వహించసాగాడు. కాని, అతడికి అప్పుడప్పుడు గతంలో తాను గడిపిన ఏకాంతజీవితం మీదికి బుద్ధి మళ్ళేది.

ఒకనాడు నందివర్ధనుడు, తన విశ్రాంతి మందిరంలో వుండగా, యువకుడొకడు ఆయన దర్శనార్థం వచ్చి, "మహారాజా, నా పేరు విశ్వకర్మ. నాకు మారువేషాలు వేయడంలో మంచి ప్రావీణ్యత వున్నది. దయచేసి నన్ను పరీక్షించి, తమ కొలువులో ఏదైనా ఉద్యోగం యివ్వండి," అని వేడుకున్నాడు.

నందివర్ధనుడు, అతణ్ణి పరీక్షించదలచాడు. విశ్వకర్మ పొరుగురాజు సింహభూపతి వేషం, మణిమేఖల సేనాధిపతి విక్రముడి వేషం, మంత్రి సుబుద్ధి వేషం వేశాడు. అతడి రూపం, మాటతీరూ అచ్చుగుద్దినట్టు అయావ్యక్తుల్లా వుండడం గమనించి, నందివర్ధనుడు అశ్చర్యపోయాడు.

నందివర్ధనుడు కోరినమీదట, విశ్వకర్మ నందివర్ధనుడి వేషం వేశాడు. అతడి

సంభాషణాపద్ధతి, నడక, రూపం తనలాగే వుండడం చూసి, నందివర్ధనుడు నిశ్చేష్టుడయ్యాడు.

ఆయన విశ్వకర్మను అభినందించి, "నీలాంటివాడు, నా కొలువులో వుండడం, నా అదృష్టం! కొంతకాలం ఇక్కడే వుండు, తగిన ఉద్యోగం యిస్తాను," అన్నాడు.

నందివర్ధనుడు రహస్యంగా, విశ్వకర్మ గురించి ఆరాతీయించాడు. విశ్వకర్మ తెలివైనవాడనీ, వినయవిధేయతలు కలవాడనీ, నిజాయితీపరుడనీ తెలిసింది. ఆ సమాచారం అందిన తర్వాత నందివర్ధనుడికి ఒక ఆలోచన వచ్చింది. అదేమంటే—విశ్వకర్మ చేత తన వేషం వేయించి సింహాసనం మీద కూర్చోబెడితే, తాను ప్రజోపయోగ పథకాలను గురించి తీరికగా ఆలోచించవచ్చు!

నందివర్ధనుడు చెప్పినది విన్న విశ్వకర్మ, "మహారాజా, మీ ఆనందం కోసం ఏమిచేయడానికైనా, నేను సిద్ధమే," అన్నాడు.

నందివర్ధనుడు అంతఃపురానికి దూరంగా, ఒక ప్రత్యేక మందిరాన్ని నిర్మింపజేశాడు. దానికి కాపలాగా నమ్మకస్థులైన సేవకులను నియమించాడు. విశ్వకర్మకు రాజ్య పరిపాలనా వ్యవహారాలను గురించి వివరంగా విశదపరిచాడు. ఎక్కడ ఎలా మెలగాలో తెలియపరిచాడు.





ఒకనాడు నందివర్ధనుడు, విశ్వకర్మతో కలిసి తన ప్రత్యేక మందిరానికి వెళ్ళాడు. ఆ తర్వాత నందివర్ధనుడి వేషంలో విశ్వకర్మ బయటకు వచ్చి, అంతఃపురం చేరాడు. నందివర్ధనుడు మాత్రం ప్రత్యేక మందిరంలోనే వుండిపోయాడు.

మర్నాడు నందివర్ధనుడి రూపంలో వున్న విశ్వకర్మ, సభామంటపం చేరాడు. అతడిని ఎవరూ అనుమానించలేదు. విశ్వకర్మ ప్రజల సమస్యల మీద తన దృష్టిని కేంద్రీకరించి, కొద్ది రోజులలోనే వాళ్ళ సంక్షేమం కోసం ప్రణాళికలు సిద్ధం చేయించాడు. ఆ తర్వాత వాటి అమలుకు సమర్థులైన ఉద్యోగులను నియమించాడు.

ముందు అనుకొన్న విధంగా, నందివర్ధనుడి రూపంలో వున్న విశ్వకర్మ, రెండు నెలల తర్వాత నందివర్ధనుడిని కలుసుకున్నాడు.

నందివర్ధనుడు, అతడితో, "విశ్వకర్మా, నీవు ఈ ప్రత్యేక మందిరంలో వుండు. నేను బయటికిపోయి, నీ పరిపాలన గురించి ఎవరేమనుకుంటున్నారో తెలుసుకుంటాను," అన్నాడు.

అంతఃపురం చేరిన నందివర్ధనుణ్ణి, మంత్రి సుబుద్ధి చూడవచ్చి, "మహారాజా, ఈ ఉదయమే దేశపరిస్థితిని గురించి చారులద్వారా పూర్తి సమాచారం తెలుసుకున్నాను. ఈ రెండు నెలలలో పరిపాలన విషయమై, తమరు చేసిన నిర్ణయాలు ప్రజల ప్రశంసలకు పాత్రమవుతున్నవి," అని చెప్పాడు.

నందివర్ధనుడు, ఆ రాత్రి తన ప్రత్యేక మందిరానికి వెళ్ళి, విశ్వకర్మతో, "నేను మరి కొన్నాళ్ళు ఇక్కడ వుండదలిచాను. నువ్వు వెళ్ళి ఎప్పటిలా పరిపాలనా వ్యవహారాలు చూడు," అన్నాడు.

మరి నాలుగు నెలలు గడిచేసరికి, విశ్వకర్మ ప్రజాసంక్షేమం విషయంలో అత్యద్భుతమైన అభివృద్ధిని సాధించాడు. కొత్తగా ధర్మసత్రాలు కట్టించాడు. గ్రామగ్రామాన పాఠశాలలు ఏర్పరిచాడు.

వ్యవసాయానికి మరిన్ని నీటిపారుదల సౌకర్యాలు కల్పించాడు. దేశంలో ఎక్కడ విన్నా రాజును గురించిన పొగడ్తలే!

అయితే, ఈ పరిస్థితులలో ఒక సంఘటన జరిగింది. రాజ్యపాలన చేస్తున్నది నందివర్ధనుడు కాదనీ, ఆయన వేషంలో వున్న విశ్వకర్మ అనీ; అసలు రాజు అంతఃపురానికి దూరంగా ప్రత్యేక మందిరంలో కాలం గడుపుతున్నాడనీ నలుగురికీ తెలిసిపోయింది.

బాధ్యతారహితంగా పరిపాలన వదిలి, స్వేచ్ఛగా కాలం గడుపుతున్న నందివర్ధనుడికంటే, విశ్వకర్మే సమర్థుడనీ, అతడే ఇకముందు కూడా రాజుగా కొనసాగాలనీ ప్రజలు ఆందోళన చేయసాగారు.

ప్రజలలో తనకు వచ్చిన చెడ్డపేరు, నందివర్ధనుడికి మనస్తాపం కలిగించింది. ఆయన విశ్వకర్మతో, "ప్రజలలో నాకున్న మంచి పేరు, నీ కారణంగా నాశనమై పోయింది. నువ్వు, నాలాగా ఈ మారు వేషం వేసి వుండకపోతే, ఈ దుస్థితి కలిగేదికాదు," అన్నాడు.

అందుకు విశ్వకర్మ, "మహారాజా, నేను వేసిన ఈ మారువేషమే, ప్రజలకు తమమీద అసంతృప్తికి కారణమైనదనుకుంటే, తమరు కేవలం స్వార్థపరులనుకో వలసివస్తుంది!" అన్నాడు.

ఆ మాటలకు నందివర్ధనుడు కన్నెర్ర చేసి, "ప్రజల ఆగ్రహం నన్నేం చేయగలదు? వాళ్ళు కోరినంత మాత్రాన నేను





సింహాసనం వదలడం, నువ్వు రాజువై పోవడం జరుగుతుందా ?'' అన్నాడు.

''క్షమించండి, మహారాజా! నేనన్న దానికి ఆగ్రహించకుండా, బాగా ఆలోచించి చూడండి,'' అన్నాడు విశ్వకర్మ.

నందివర్ధనుడు తన అంతఃపురం చేరి, ఏమి చేయడం బావుంటుందన్న విషయమై బాగా తర్కించుకుని, ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ మర్నాడే సభామంటపానికి దేశంలోని ముఖ్యులనూ, నగర ప్రముఖులనూ రావలసిందిగా ఆహ్వానిస్తూ చాటింపు వేయించాడు.

సభకు వచ్చినవాళ్ళతో నందివర్ధనుడు, ''నేను బాధ్యతారహితంగా ప్రవర్తించానని, ప్రజలు అనుకుంటున్నట్టు, నాకు తెలిసింది. నేను ప్రజల తీర్పుకు తల ఒగ్గదలిచాను. ఈనాటినుంచీ విశ్వకర్మే రాజుగా కొనసాగుతాడు,'' అన్నాడు.

అది విన్నవాళ్ళందరూ ఆమోద సూచకంగా కరతాళధ్వనులు చేశారు. అప్పుడు నందివర్ధనుడు, విశ్వకర్మతో, ''ప్రజాభిప్రాయమేమిటో తెలిసిపోయింది. ఇక నువ్వు సింహాసనం అధిష్ఠించు,'' అన్నాడు.

విశ్వకర్మ అందుకు అంగీకరించక, సభలో వున్నవారితో, ''మహారాజు బాధ్యతారహితంగా ఏమీ ప్రవర్తించలేదు. ఈమధ్య కొంతకాలంగా నావల్ల అమలు జరిగిన పథకాలన్నీ, రాజుగారి సలహా మీద జరిగినవే! రాజ్యపాలన నాశక్తికి మించిన పని. నన్ను మన్నించండి,'' అన్నాడు.

విశ్వకర్మ ఇలా అనగానే, సభికులందరూ ఏకకంఠంగా, ''నందివర్ధన మహారాజుకూ జై!'' అంటూ హర్షధ్వానాలు చేశారు.

నందివర్ధనుడు వాళ్ళతో, ''సింహాసనాన్నే తిరస్కరించిన, ఈ విశ్వకర్మ ఎంతటి యోగ్యుడో మీరు గ్రహించే వుంటారు. ఈనాటి నుంచి ఇతణ్ణి, నా ఆంతరంగిక సలహాదారుగా నియమిస్తున్నాను,'' అన్నాడు.

ఇందుకు ప్రజలు తమ ఆమోదాన్ని తెలియచేశారు. నందివర్ధనుడు సభ చాలించి, విశ్వకర్మతో తన ప్రత్యేక మందిరానికి బయలుదేరాడు. దారిలో విశ్వకర్మ, ఆయనతో, "మీరు చాలా నిస్వార్థపరులు, మహారాజా!" అన్నాడు.

నందివర్ధనుడు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విశ్వకర్మ అతి సునాయాసంగా తనకు లభించనున్న సింహాసనాన్ని ఎందుకు వదులుకున్నాడు? రాజ్యపాలన అతడి శక్తికిమించిన పని కావడం వల్లనా? అతడొకసారి రాజు నందివర్ధనుణ్ణి స్వార్ధపరుడివనీ, మరొకసారి నిస్వార్ధపరుడివనీ అన్నాడు. అందుకు కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విశ్వకర్మ పరిపాలనాదక్షుడన్న విషయం రుజువైనదే. అయితే, అతడు నిజాయితీపరుడూ, స్వామిభక్తిపరాయణుడూ కావడంవల్ల, తనకు రాజ్యపాలన శక్తికి మించినపని అని అబద్ధమాడి, సింహాసనాన్ని నిరాకరించాడు. అతడు, రాజును ఒకసారి స్వార్థపరుడనడానికి కారణం—నందివర్ధనుడికి ఎదురైన చిక్కులు తను మారువేషం వేయడంవల్లనే కాదనీ, అతడు గ్రంథపఠనాసక్తి కొద్దీ మారువేషం వేసి తెరచాటుకు పోయాడనీ, అది గ్రహించమనీ హెచ్చరించడం. ఇక నిస్వార్థపరుడనడానికి కారణం—కొన్ని నెలలపాటు రాజ్యానికి సంబంధించిన అన్ని రహస్యాలూ ఎరిగిన తనను బయిటికి పంపకుండా, అంతరంగిక సలహాదారుగా నియమించుకోవడంలో నందివర్ధనుడు ప్రదర్శించిన తెలివితేటలు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]



# స్వామికార్యం-స్వకార్యం

మన్నూరిపూడి అనే గ్రామంలో, దేవాలయ నిర్మాణానికి ప్రముఖులిద్దరు చందాలు వసూలు చేయసాగారు. పిల్లికి భిక్షం పెట్టని భూషయ్య, ఆ గ్రామంలోని పెద్ద రైతుల్లో ఒకడు. చందాల పట్టీలో తన పేరు రాయలేదని తెలుసుకున్న భూషయ్యకు, తలకొట్టేసినట్టయింది.

ఒక రోజు బస్తీనుంచి తిరిగివచ్చిన భూషయ్యకు, చందాలు వసూలు చేస్తున్న ఇద్దరూ కంటబడ్డారు. భూషయ్య వాళ్ళను పిలిచి, "మీరు చేపట్టిన కార్యం మెచ్చదగింది. రేపు ఉదయానే మీరొకసారి, మా ఇంటికి రండి!" అని చెప్పాడు.

"అదెంతభాగ్యం!" అన్నారు వాళ్ళు. మర్నాడు ఇంటికొచ్చిన వాళ్ళిద్దర్నీ భూషయ్య చిరునవ్వుతో పలకరించి, "చూడు, శివుడూ!" అంటూ దాపులవున్న ఒక గేదెను చూపి, "పశువైద్యంలో నువ్వు దిట్టవుగదా. దీని చెవులోంచి చీము కారుతున్నది," అన్నాడు.

శివుడు గేదెను పరీక్షించి, "ఇదేం మొండి వ్యాధికాదు," అని ఏదో ఆకుపసరు గేదె చెవిలో పిండాడు. తర్వాత భూషయ్య రెండవవాడితో, "చూడు, ఆచారీ! వాస్తులో ఘటికుడవని నిన్ను గురించి అందరూ చెప్పకుంటారు. పశువులకొట్టం ఎక్కడ వేయించమంటావు?" అని అడిగాడు.

అందుకు ఆచారి, "ఈ జాగాలో కొట్టంవేస్తే, శ్రేయస్కరం!" అని గీత గీసి స్థల నిర్ధారణ చేశాడు. "సరే, ఇదీ నా చందా," అంటూ భూషయ్య యాభైరూపాయిలు వాళ్ళకిచ్చాడు.

ఆ సాయంత్రం ఊరి రచ్చబండదగ్గిర శివుడూ, ఆచారీ, "భూషయ్యలాంటి జగదేక పిసినిగొట్టు నుంచి, దేవాలయ నిర్మాణానికి యాభై రూపాయల చందా వసూలు చేశాం!" అన్నారు.

అది విని అందరూ ఆశ్చర్యపోతూంటే, ఒక వృద్ధుడు, శివుణ్ణి, "నువ్వు చేసిన వైద్యానికి మామూలుగా ఎంత తీసుకుంటావు?" అని అడిగాడు.

"అధమపక్షం ఇరవై రూపాయిలు," అన్నాడు శివుడు.

"ఆచారీ నువ్వో?" అని ప్రశ్నించాడు వృద్ధుడు.

"నూటపదహార్లు యివ్వందే, నా దగ్గిర వాస్తు విషయం ఎత్తగూడదు!" అన్నాడు ఆచారి.

"అలా అయితే—కేవలం యాభైరూపాయిలతో భూషయ్య, అటు స్వామికార్యం, స్వకార్యం కూడా నెరవేర్చుకున్నాడు!" అన్నాడు వృద్ధుడు.

—కె. కె. రావు



# చందమామ అనుబంధం—16

## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

క్రీ.శ. 197 వ సంవత్సరంలో బ్రాహ్మణ యువకుడొకడు కొందరు అనుచరులతో కలిసి సముద్రయానానికి బయలుదేరాడు. కొన్ని వారాలపాటు పడవలలో ప్రయాణం చేశాక వాళ్ళొక భూభాగం కనుగొన్నారు. పడవలు తీరం సమీపించేసరికి, వాళ్ళను అక్కడి సైనికులు ఎదుర్కొన్నారు. ఆ సైన్యానికి ఒక యువతి నాయకత్వం వహించడం ఆ యువకుడు చూసి, విల్లు ఎక్కుపెట్టాడే తప్ప ఒక్క బాణం వదలలేకపోయాడు. అతణ్ణి చూసి ఆ యువతి కూడా అలాగే నిలబడిపోయింది. యువకుడు ఆమెను సమీపించి అందాల వస్త్రాన్ని బహూకరించాడు. ఆ తరవాత ఇరువురూ పెళ్ళాడారు. ఆ యువకుడు అక్కడ హైందవ రాజ్యం స్థాపించాడు!

ఆ యువకుడు ఎవరు? ఆయన స్థాపించిన రాజ్యం ఏది?

(36 వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. పాకిస్థాన్ అనే పదాన్ని రూపొందించినవారెవరు?
2. ఎప్పుడు రూపొందించారు?
3. ఆ మాటకు అర్థం ఏమిటి?
4. బుద్ధుడు జన్మించిన లుంబినీవనాన్ని ఈనాడు ఏమని పిలుస్తారు?
5. దానిని ఎలా కనుగొన్నారు?

(36 వ పేజీ చూడండి)

# గాంధార- తక్షశిల

ఈనాటి మన దేశపటంలో గాంధార మనే ప్రాంతం లేదు. అయినా, గాంధార రాజ్యం గురించి తెలియనివారంటూ మనలో ఎవరూ వుండరు!

మన పురాతన సారస్వతంలో గాంధార రాజ్యం గురించిన ప్రస్తావన అక్కడక్కడా కనిపిస్తుంది. అంగ, వంగ, కళింగాది యాభైఆరు రాజ్యాలలో గాంధార ముఖ్యమైనది. ధృతరాష్ట్రుడి పత్ని గాంధారి, గాంధారదేశపు యువరాణి. అందుకే ఆమెకా పేరు వచ్చింది. గాంధారి సోదరుడు శకుని గాంధార దేశపు రాజు. కురుపాండవ సంఘర్షణలో శకుని వహించిన కీలకపాత్ర అందరూ ఎరిగినదే!

సింధునదికి ఇరువైపులా గాంధార రాజ్యం విస్తరించి వుండేది. ఆ ప్రాంతం ఈనాడు, పాకిస్థాన్‌లో రావల్పిండి, పెషావర్ జిల్లాలుగా పిలువబడుతున్నది.

Kabul
Taxila
GANDHARA
Sindu
Indraprastha
Hastinapur
Prayag



GANDHARAN ART

Chandran






పురాణకాలానికి తరవాత కూడా, గాంధార రాజ్య వైభవం కొనసాగింది. ముఖ్యంగా ఆ రాజ్యంలోని తక్షశిల, పుష్కలావతి నగరాలు—ఉన్నత విద్యకూ, సంస్కృతికీ, వాణిజ్య వ్యాపారాలకూ కేంద్రాలుగా వెలుగొందాయి.

విశ్వవిఖ్యాతిగాంచిన తక్షశిల విశ్వవిద్యాలయంలో జగత్ప్రసిద్ధులైన మేధావులెందరో విద్య నభ్యసించారు. క్రీ. పూ. 5వ శతాబ్దంలో మగధను పరిపాలించిన బింబిసారుడి ఆస్థానాన్ని అలంకరించిన సుప్రసిద్ధ వైద్యవేత్త జీవకుడు తక్షశిల విశ్వవిద్యాలయంలోనే ఏడేళ్ళపాటు విద్య నభ్యసించాడు!

రావల్పిండికి 30 కి. మీ. దూరంలో వున్న సరాయ్—కొలా రైల్వేస్టేషన్ సమీపంలో తక్షశిల శిథిలాలు బయల్పడ్డాయి.

గాంధార, కొంతకాలం పారశీక సామ్రాజ్యంలో కలిసి వుండేది. ఈ రాజ్యంలోని కొన్ని ప్రాంతాలను, గ్రీకులు కూడా తమ అధికారంలోకి తెచ్చుకున్నారు. అందుకే ఈ ప్రాంతంలోని కళలమీదా, శిల్పం మీదా విదేశీప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ఈనాటికీ, గాంధార కళలకు ఒక విశిష్టస్థానం ఉన్నది.

కొండలమధ్య, అక్కడక్కడి లోయలలో నివసిస్తూ అపురూప ధైర్య సాహసాలకు పేరు గాంచిన పఠానుల మాతృభూమికి, పెషావర్ సింహ ద్వారంగా ఉంటున్నది!

# సాహిత్యావలోకనం

1. శ్రీకృష్ణుణ్ణి గురించి తెలియజేసే రెండు ప్రధాన గ్రంథాలు ఏవి ?

2. ముఖ్యమైన మూడు విషయాలను వివరిస్తూ మూడు శతకాలను రచించిన కవి ఎవరు ?

3. ఆ మూడు శతకాలు ఏవి ?

4. ఆ కవి ఎక్కడ జన్మించాడు ?

5. ఈజిప్టుకు చెందిన అతి ప్రాచీనమైన పుస్తకం ఏది ?

6. అది ఎంత ప్రాచీనమైనది ?

## సమాధానాలు

ఎవరాయన ?

కాంభోజ (కాంబోడియా) దేశాన్ని స్థాపించిన కౌండిన్యుడు.

లోకజ్ఞానం

1. చౌదరి రహ్మత్ అలీ.
2. 1933 వ సంవత్సరంలో.
3. "పవిత్రుల భూమి"
4. నేపాల్ టెరాయ్‌లో వున్న రుమ్మిన్‌డీ.
5. అశోక చక్రవర్తి నిర్మించిన రాతి స్తంభం ఈ నాటికీ అక్కడ వున్నది.

సాహిత్యం

1. భాగవతం; మహాభారతం.
2. భర్తృహరి.
3. శృంగారశతకం; వైరాగ్యశతకం; నీతిశతకం.
4. ఆయన ఉజ్జయినీ యువరాజని చెబుతారు.
5. 'మృతుల గ్రంథం'.
6. అందులో కొంత భాగం క్రీ. పూ. 3,200 నాటికే ఉండేది.




# బంగారయ్య ఆస్తి

శిళ్ళంగేరి గ్రామంలో, బంగారయ్య అనే ఒక సామాన్య కుటుంబీకుడుండేవాడు. ఆయనకు తిరుమలయ్య, వెంకయ్య అనే ఇద్దరు కొడుకులు, మంగమ్మ అనే ఒక కూతురు. బంగారయ్య వాళ్ళందరికీ పెళ్ళిళ్ళు చేశాడు. ఆయన చనిపోయే నాటివరకూ, అందరూ ఉమ్మడి కుటుంబంగా వుండేవారు. మంగమ్మ అదే గ్రామంలో వుండేది.

బంగారయ్య పోయాక, ఆయన కొడుకులు ఉన్న కొద్ది ఆస్తినీ పంచుకుని, వేరు, వేరు కాపరాలు పెట్టారు. బంగారయ్య భార్య తాయారమ్మ, ఇద్దరు కొడుకుల వద్దా వంతులవారీగా వుంటూ వచ్చింది.

ప్రారంభంలో తాయారమ్మను, కోడళ్ళు గౌరవంగా చూసేవారు. కాని, రానురాను వాళ్ళు తాయారమ్మపట్ల కటువుగా ప్రవర్తించసాగారు. అందుకు ముఖ్య కారణం, ఆమెవద్ద నగలుగానీ, డబ్బుగానీ లేకపోవడం. ఆమెకు జబ్బు చేస్తే, డబ్బు ఖర్చవుతుందని సరైన వైద్యం కూడా చేయించేవారు కాదు. కొడుకులు తమ భార్యలను అదుపులో పెట్టలేకపోయారు. మరి కొన్నాళ్ళు గడిచాక, వాళ్ళు తల్లిని పోషించడం బరువన్నట్టు ప్రవర్తించసాగారు.

తాయారమ్మ, కొడుకులవద్ద వుండలేక, కూతురు మంగమ్మ ఇంటికి వెళ్ళి వుండసాగింది. మంగమ్మ కొద్ది రోజులపాటు తల్లిని ఆదరంగా చూసి, తర్వాత అవకాశం చిక్కినప్పుడల్లా, "ఆస్తిని పంచుకోవడానికి కొడుకులు; పోషించడానికి కూతురు!" అని ఎత్తిపోటు మాటలు అనసాగింది.

తాయారమ్మకు, కూతురు మాటల్లో ఏదో కొంత న్యాయంవున్నట్టుగాతోచి, గ్రామ

కోలార్ కృష్ణ అయ్యర్

పెద్ద వద్దకు వెళ్ళి, కొడుకుల మీద ఫిర్యాదు చేసింది. గ్రామ పెద్ద అంటే అందరికీ గౌరవం. ఆయన చెప్పే తీర్పుల్లో న్యాయం వుంటుందని అందరూ నమ్మేవారు.

తాయారమ్మను కొడుకులూ, కోడళ్ళూ సరిగా చూడకపోవడానికి కారణం ఏమిటో గ్రహించిన గ్రామపెద్ద, ఆమెతో, "తాయారమ్మా, నువ్వేమీ దిగులుపడకు. నీ భర్త చనిపోయేదానికి నెల రోజుల ముందు, ఒక పెట్టెలో కొన్ని బంగారునగలు దాచి, నావద్ద వుంచాడు. అలా చేయడానికి కారణం ఏమిటో మాత్రం, నాకు చెప్ప లేదు. నేను, నీ కొడుకులతో, కోడళ్ళతో, కూతురుతో మాట్లాడతాను. ప్రస్తుతానికి, నా ఇంట్లోనే వుండు," అన్నాడు.

తర్వాత ఆయన వాళ్ళందరినీ పిలిపించి, "మీరు, ఈ ముసలితనంలో తాయారమ్మను సరిగా ఆదరించకపోవడం, అన్యాయం అనిపించుకుంటుంది. కన్న తల్లిని పోషించవలసిన బాధ్యత కొడుకులది. అయినా ఒకవేళ మీరు, మీ తల్లిని సరిగా చూడకపోతే, ఆమెకు సుఖంగా జీవించే ఆధారం లేకపోలేదు," అన్నాడు.

గ్రామపెద్ద మాటలు అర్థం కాక తాయారమ్మ కొడుకులు, "అయ్యా, మీరు చెప్పేదేమిటో మాకు అంతుబట్టడంలేదు. కాస్త వివరంగా చెప్పండి," అన్నారు.

"మరేం లేదు. బంగారయ్య చనిపోయే ముందు, బంగారునగలున్న ఒక పెట్టెను



నాకు యిచ్చి—తనూ, తాయారమ్మా పోయాక, ఆ పెట్టెలో వున్న నగలను మీకూ, కుమార్తెకూ సరిసమానంగా పంచి యివ్వమన్నాడు. అంతేకాక, మీలో ఎవరైనా ఆమెను సరిగా చూడకపోతే, వాళ్ళకు నగలలో వాటా యివ్వవద్దన్నాడు. ఇప్పటి పరిస్థితి చూశాక, ఆ నగలను అమ్మి, తాయారమ్మ పోషణకోసం ఆ డబ్బును ఖర్చు పెట్టాలనుకుంటున్నాను. మీరేమంటారు ?'' అని అడిగాడు గ్రామ పెద్ద.

తాయారమ్మ కొడుకులతోపాటు అందరూ, గ్రామ పెద్ద కేసి ఆశ్చర్యంగా చూశారు. గ్రామపెద్ద ఇంట్లోకిపోయి, ఒక పెట్టెను తీసుకువచ్చి, దాని మూత తెరిచాడు. లోపల తళతళలాడుతూ చాలా నగలున్నాయి. వాటి ఖరీదు ఎంతలేదన్నా యాభైవేలుంటుందని, తాయారమ్మ బంధుగణమంతా అంచనా వేసుకున్నారు.

వాళ్ళు గ్రామ పెద్దతో, ''అయ్యా, జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఆమె పట్ల తగిన ఆదరాభిమానాలు చూపలేదని మాకూ బాధగానే వున్నది. ఇంతవరకూ మావల్ల జరిగిన పొరబాట్లను క్షమించండి!" అని, తాయారమ్మను మా ఇంటికి రమ్మంటే, మా ఇంటికి రమ్మని బతిమాలారు.

తాయారమ్మ, ఒక్కొక్కరి ఇంట్లో నెల రోజులపాటు వంతులవారీగా వుండడానికి అంగీకరించింది. ఆనాటి నుంచీ ఆమెను



కోడళ్ళూ, కూతురూ ఎంతో ఆప్యాయంగా చూడసాగారు. ఆమెకు అవసరం అయిన అన్ని సదుపాయాలూ సమకూర్చారు.

ఆ తర్వాత కొంత కాలం పాటు తాయారమ్మ, ఎలాంటి యిబ్బందులూ లేకుండా సుఖంగా బతికి, ఒకనాడు చని పోయింది. కర్మలన్నీ కొడుకులూ, అల్లుడూ ఘనంగా జరిపించారు.

ఒకనాడు వాళ్ళందరూ గ్రామపెద్ద ఇంటికి వెళ్ళి, తాయారమ్మ నగలను పంచిపెట్టమని కోరారు. ఆయన సరేనని, వాటి వెల కట్టడానికీ, అందరికీ సమంగా పంచడానికీ, గ్రామంలోని శరభయ్య అనే నగలు చేసే అతణ్ణి పిలిపించాడు.

శరభయ్య, వాటిని చూసి తెల్లబోయాడు. అవన్నీ బంగారువి కాదు; నకిలీబంగారు నగలు. ఇది విని తాయారమ్మ కొడుకులూ, కోడళ్ళూ, కూతురూ నిర్ఘాంతపోయారు.

"ఎంతమోసం! అన్నీ నకిలీనగలు దాచి, మమ్మల్ని మోసం చేశారు," అన్నారు వాళ్ళు.

గ్రామపెద్ద చిన్నగా నవ్వి, "మీరు మాత్రం ఏం చేశారు? కేవలం నగల ఆశతో తాయారమ్మ పైన నకిలీప్రేమ చూపించారు. నకిలీ ప్రేమకు, నకిలీ నగలు ప్రతిఫలం! ఏమంటారు?" అని అడిగాడు.

దానికి ఎవరూ జవాబు చెప్పకుండా, తాయారమ్మ పట్ల తామెంత నిర్దయగా ప్రవర్తించినదీ గుర్తుకు తెచ్చుకుని, అవమానంతో తలలు వంచుకున్నారు.

"ఏ విత్తనానికాచెట్టు, అన్న సామెత మీరు వినే వుంటారు. మీ మనసుల్లాగే, ఈ నకిలీనగలూ పైకి ఒక రకంగా, అంతర్యంలో మరొక రకంగా వుండడం జరిగింది. ఇక వెళ్ళండి!" అన్నాడు గ్రామపెద్ద.

జరిగిందేమంటే—బంగారయ్య, గ్రామ పెద్ద వద్ద ఎలాంటి నగలూ వుంచిపోలేదు. బంగారయ్య ఆత్మబంధువుల్లో మార్పు తెచ్చేందుకు, గ్రామపెద్ద ఇలాంటి ఎత్తు గడ వేశాడు.





# అటకమీద విచిత్రం

అరవిందం, ముకుందం ఇద్దరూ అన్నదమ్ములు. శ్రీకాంతపురంలో ఇద్దరూ ఒకేచోట కొత్తగా ఇళ్ళు కట్టుకున్నారు. గృహప్రవేశ సమయంలో పురోహితుడు వెంకటావధాని, ''ఇంటివాస్తులు అన్నీ బాగున్నాయి. కానీ ఎడమపక్క ఇంటిని ముకుందం, కుడిపక్క ఇంటిని అరవిందం తీసుకుంటే మంచిది.'' అన్నాడు.

అన్నదమ్ములిద్దరూ కంగారుపడి, ''అలా ఇద్దరం ఇళ్ళు మార్చుకోకపోతే, ఏం జరుగుతుంది ?'' అని పురోహితుణ్ణి ఆత్రుతగా అడిగారు.

''మీమీ జన్మనక్షత్రాలకు తగ్గట్టుగా, నేను లెక్కలు గుణించి చెప్పాను. అలా ఇళ్ళు మార్చుకోకపోవడంవల్ల, ఒక రకమైన దుష్టశక్తులు మిమ్మల్ని ఆటపట్టిస్తాయి. అయితే వాటివల్ల ప్రాణహాని మాత్రం లేదు,'' అన్నాడు వెంకటావధాని.

''ఇంతేగదా ? ఏమిటో అనుకున్నాం. మేము దుష్టశక్తులంటే నమ్మం. మా శక్తులమీద మాకు తిరుగులేని నమ్మకం వున్నది. అంతేనంటావా, ముకుందం ?'' అని కొంచెం వణుకుతున్న గొంతుతో తమ్ముణ్ణడిగాడు అరవిందం.

''కాకమరేమిటి!'' అన్నాడు ముకుందం పక్కచూపులు చూస్తూ బింకంగా.

అన్నదమ్ములమాటలకు వెంకటావధాని కోపం తెచ్చుకుని, ''అలాంటప్పుడు, నాచేత గృహప్రవేశం ఎందుకు చేయించుకున్నారు. నాకు తెలిసిందేదో చెప్పాను. తర్వాత మీ ఖర్మం !'' అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

అరవిందం, ముకుందం ఎవరి ఇళ్ళలో వాళ్ళు, తమ సామాన్లు సర్దుకున్నారు. సామాన్లు ఎక్కువగా వుండడంతో, ఇద్దరూ కొన్ని సామాన్లను అటకమీద

రాంబాబు



సర్దారు. అరవిందం తన ఇంటి అటక మీద రెండు నూనెడబ్బాలనూ, పది బస్తాల ధాన్యాన్నీ, ఇంకా ఇతర చిల్లర సామాన్లనూ సర్దాడు. ముకుందం తన ఇంటి అటకమీద ఐదు బస్తాల మినుముల్నీ, రెండు ఊరగాయల జాడీలనూ వుంచాడు.

ఇద్దరూ ఆ రాత్రి కొత్త ఇళ్ళలో పడుకున్నాక, అర్ధరాత్రివేళ ఏదో ఆలోచిస్తూ అరవిందం ఒక బస్తా ధాన్యాన్ని దింపుదామని అటక ఎక్కి చూస్తే, అక్కడ ధాన్యానికి బదులు మినుముల బస్తాలూ, ఊరగాయ జాడీలూ వున్నవి. అవి తమ్ముడి సామాన్లని గ్రహించి, అరవిందం వెంటనే అటకదిగి, గబగబా తమ్ముడి ఇంటికేసి వెళ్ళాడు.

అదే సమయంలో ముకుందం కంగారు పడుతూ, అరవిందం ఇంటికేసి వస్తున్నాడు. అరవిందం తమ్ముణ్ణి, "నీ అటక మీద నా సామాన్లేమయినా వున్నాయా?" అని అడిగాడు.

"అవును. నా అటక మీదికి నీ సామాన్లన్నీ వచ్చాయి. ఇదేదో చిత్రంగా వుంది. మరి, నా సామాన్లన్నీ నీ అటక మీదికి రాలేదు కదా?" అన్నాడు ముకుందం.

"జరిగిందదే!" అన్నాడు అరవిందం ఆశ్చర్యంగా.

ఇదేదో చాలా విచిత్రంగా వుంది, అనుకుంటూ అన్నదమ్ము లిద్దరూ తిరిగి వాళ్ళ, వాళ్ళ సామాన్లను ఎవరి అటకల మీద వాళ్ళు సర్దుకున్నారు.

తెల్లవారి నిద్రలేస్తూనే అరవిందం, "ఇదేం పీడకల!" అనుకుంటూ, తమ్ముణ్ణి పలకరించి వద్దామని ముకుందం ఇంటికి వెళ్ళాడు.

ఆ సమయంలో ముకుందం, ఇంటి వసారాలోని అరుగు మీద కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. అతడి కళ్ళు రాత్రి నిద్రలేనట్టు ఎర్రగా వున్నాయి. అరవిందం తమ్ముణ్ణి సమీపించి, "రాత్రి నీకు

సరిగా నిద్రపట్టినట్టులేదే?" అని ప్రశ్నించాడు.

ముకుందం, అన్న ముఖం కేసి తేరి పారజూస్తూ, "నీకూ సరిగా నిద్రపట్టినట్టు లేదు, ఏం జరిగిందేమిటి?" అని అడిగాడు.

అరవిందం తన అనుభవం గురించి చెప్పాడు. ముకుందం ఆశ్చర్యపోతూ, "నాకూ, అలాంటి అనుభవమే అయింది. అటక ఎక్కి మినుములబస్తా దింపుదామని చూస్తే, అక్కడ వడ్లబస్తాలున్నవి," అన్నాడు.

"అంతా విచిత్రంగా వుందే! నీకు దుష్టశక్తులంటే ఏమైనా నమ్మకమా?" అని అడిగాడు అరవిందం తమ్ముణ్ణి.

"అలాంటి నమ్మకాలేం లేవని, మనం వెంకటావధానితో చెప్పాం గదా," అన్నాడు ముకుందం.

"అవునవును! ఆ మాట మరిచాను," అంటూ అరవిందం తన ఇంటికి వెళ్ళాడు.

ఆ రాత్రి ఇద్దరూ, ఈ పీడకలల సంగతేమిటో తేల్చుకోవాలని, వాళ్ళవాళ్ళ అటకల మీద పడుకున్నారు.

మర్నాడు అరవిందం నిద్రలేచి, సామాన్లన్నీ ఏమీ మారకుండా వుండడం గమనించి, సంతోషంగా భార్యను కేక వేశాడు.

ఆ కేక విని అక్కడికి తమ్ముడు ముకుందం భార్య వచ్చి, "అయినా బావగారు, మా అటకమీదికి ఎందుకు వెళ్ళారో



అర్థం కావడం లేదు!'' అన్నది చిరాకు పడుతూ.

అరవిందం ఆశ్చర్యపోయి, ఏదో జవాబు చెప్పబోయేంతలో, అతడికి మెలుకువ వచ్చింది. అంతలో అతడి భార్య అటక దగ్గిరకు వచ్చి, ''ఏదైనా పనుంటే, అటక మీది నుంచి కేక పెట్టాలా ?'' అన్నది విసుక్కుంటూ.

''ఇంకో పీడకల!'' అనుకుంటూ అరవిందం, వెంటనే తమ్ముడి ఇంటికి పోయి, జరిగింది చెప్పి, ''నీకూ ఏమైనా పీడకలలు రాలేదుగదా?'' అని అడిగాడు.

''పీడకలలా! ఒకటా, రెండా—ఎన్నని గుర్తుపెట్టుకోను. ఆ కలలతోనే రాత్రి గడిచిపోయినా ప్రాణానికి హాయిగా వుండును. మధ్యమధ్య నిద్రబెడుతున్నది. ఇలా అయితే, నా ఆరోగ్యం మరెంతో కాలం నిలవదు,'' అన్నాడు ముకుందం బాధగా ముఖం పెట్టి.

''నీకు దుష్టశక్తులంటే నమ్మకం లేదు గదా ?'' అని అడిగాడు అరవిందం.

''ఏమో! ఆ రోజు వెంకటావధానిగారు, మనల్ని ఇళ్ళు మార్చుకోమన్నప్పుడు, అలాంటి నమ్మకాలేం లేవని నువ్వన్నావు. నేనూ నీకు వంత పాడాను,'' అన్నాడు ముకుందం.

అరవిందం కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, ''దుష్టశక్తులున్నవో లేవో, ఆ సంగతి వదిలేద్దాం. వెంకటావధానిగారి మాటల్తో, మనిద్దరి మనసుల్లోనూ ఏదో ఒక చిన్న అనుమానం తలెత్తింది. ఎందుకొచ్చిన గొడవ! పీడకలలతో ఎన్ని రాత్రులు నిద్ర లేకుండా వుండగలం, అవధానిగారిచ్చిన సలహాప్రకారం, ఇళ్ళు మారుదాం,'' అన్నాడు.

''నేనూ అదే ఆలోచిస్తున్నాను. అలాగే చేద్దాం,'' అన్నాడు ముకుందం చాలా ఆనందంగా.

ఆ రోజే అన్నదమ్ములిద్దరూ తమ, తమ సామాన్లతో ఇళ్ళు మారారు. ఆ తర్వాత ఆ రాత్రేకాదు, మరేరాత్రీ వాళ్ళను పీడకలలు బాధించలేదు.





# కృష్ణావతారం

ద్రౌపదీ, కృష్ణుడి భార్యలూ, ఇతర స్త్రీజనమూ తమలోతాము కబుర్లు చెప్పుకున్నట్టుగానే పురుషులంతా ఒకచోట చేరి వారి ముచ్చట్లు వారు చెప్పుకున్నారు. ఆ సమయంలో అనేకమంది మునులు బలరామకృష్ణులను చూడ వచ్చారు. పాండవులూ, మిగిలిన రాజులూ గౌరవ పూర్వకంగా లేచి, మునులకు నమస్కారాలు చేశారు. అందరితోబాటు కృష్ణుడూ, బలరాముడూ కూడా వారిని శ్రద్ధాభక్తులతో పూజించారు.

మునులు కృష్ణుణ్ణి కీర్తించి, "నువు మానవరూపం ధరించిన ఆదిదేవుడివి. మేము ఎంత తత్వవేత్తలమైనా నీ మాయకు కట్టుబడిన వాళ్ళమే," అన్నారు.

వసుదేవుడు ఆ మునుల సలహాపైన యజ్ఞాలు చేసి దేవఋణం తీర్చుకుందామని సంకల్పించాడు. యాదవులు యజ్ఞానికి అవసరమైన సంబారాలన్నీ సమకూర్చారు. వసుదేవుడూ, అయనకు గల పద్దెనిమిదిమంది భార్యలూ స్నానాలు చేసి, కొత్తబట్టలూ అభరణాలూ ధరించి యజ్ఞదీక్ష వహించారు. మునుల సహాయంతో ప్రకృతి యజ్ఞాలూ, వికృతి యజ్ఞాలూ చేసి, అన్ని యజ్ఞాలలోనూ యజ్ఞపురుషుణ్ణి ఆరాధించి, ఋత్విక్కులకు ఆవులనూ, భూమినీ, కన్యలనూ దక్షిణగా ఇచ్చి తృప్తి పరచాడు.

యజ్ఞాలు పూర్తి అయిన అనంతరం అవభృత స్నానం చేసి వసుదేవుడు తన



బంధుజనాని కంతటికీ గొప్పగా విందులు చేశాడు.

ఒకనాడు దేవకీదేవికి ఒక ఆలోచన వచ్చింది. తన కొడుకులు బలరామ కృష్ణులు సామాన్యులు కారు, శక్తి సంపన్నులు. వారు తమ గురువుకు గురు దక్షిణ కింద, చచ్చిపోయిన గురుపుత్రుణ్ణి తెచ్చి ఇచ్చారు. కంసుడు తన కొడుకులను వరసగా చంపేశాడు. అలా పోయిన తన కొడుకులందరినీ వాళ్ళు తిరిగి తీసుకు వచ్చి తనకు చూపించలేరా ?

ఆమె ఈ మాటే బలరామకృష్ణులను అడిగింది. వాళ్ళు అలాగేనని దేవకీదేవికి చెప్పి, యోగమాయ ధరించి, సుతలానికి వెళ్ళారు. అక్కడ బలిచక్రవర్తి వారికి ఘనమైన స్వాగతం తెలిపి, వారు వచ్చిన పని అడిగాడు.

"మహారాజా, పూర్వం స్వాయంభువ మన్వంతర కాలంలో మరీచి కొడుకులు ఆరుగురు—బ్రహ్మ సరస్వతిని ప్రేమించగా చూసి నవ్వారు. అప్పుడు బ్రహ్మ వారిని రాక్షసులుగా పుట్టమని శపించాడు. స్మరుడూ, ఉద్గీథుడూ, పరిష్వంగుడూ, పతంగుడూ, క్షుద్రభువూ, ఘృణీ అనే ఆ ఆరుగురూ మొదట హిరణ్యకశిపుడి కొడుకులై పుట్టి, అనంతరం మా తల్లి అయిన దేవకీదేవి గర్భాన జన్మించి, కంసుడి చేత చంపబడి, ఇప్పుడు నీ రాజ్యంలో ఉన్నారు. వారిని నా వెంట పంపినట్టయితే, మా తల్లికి చూపి, ఆమె విచారాన్ని పోగొడతాను. ఆ తరవాత వారిని ఉత్తమ లోకాలకు పంపుతాను," అని కృష్ణుడు బలితో అన్నాడు.

అందుకు బలి అంగీకరించి, ఆ ఆరుగురినీ కృష్ణుడి వెంట పంపాడు. తాను పోగొట్టుకున్న ఆ కొడుకులను చూసి దేవకీదేవి ఎంతో సంతోషించింది. ఆమె వారిని కౌగలించుకుని, తన పాలు కూడా ఇచ్చింది. తరవాత ఆ ఆరుగురూ కృష్ణుడి అనుగ్రహంవల్ల ఊర్ధ్వలోకాలకు పోయారు.

కాలం గడిచిపోయింది. భారత యుద్ధంలో కౌరవపాండవులు అపారమైన జనక్షయం కలిగించారు. యుద్ధంలో గెలిచిన ధర్మరాజును సింహాసనం పైన కూర్చొబెట్టి కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడు.

ఒకనాడు కృష్ణుణ్ణి చూడటానికి విశ్వామిత్రుడూ, అసితుడూ, కణ్వుడూ, దూర్వాసుడూ, భృగువూ, అంగిరసుడూ, కశ్యపుడూ, వామదేవుడూ, అత్రీ, వసిష్ఠుడూ, నారదుడూ మొదలైన మునులు వచ్చినప్పుడు కొందరు యాదవకుమారులు సాంబుడికి గర్భిణీస్త్రీ వేషం వేసి వారి దగ్గిరికి తెచ్చి, ఎంతో వినయం నటిస్తూ, "ఈమె తనకే బిడ్డ కలిగేదీ మిమ్మల్ని అడగటానికి సిగ్గు పడుతున్నది. అందుచేత మేమే అడుగుతున్నాం. తమకు తెలియనిదంటూ లేదు గనక దయచేసి ఏ బిడ్డ కలిగేదీ చెబుతారా?" అని మునులను అడిగారు.

మునులకు చాలా కోపం వచ్చింది. "మూఢులారా, దీని కడుపున కులనాశనకరమైన ముసలం పుడుతుంది!" అని వారు శపించారు.

యాదవకుమారులు భయపడి పారిపోయి, సాంబుడి బట్టలు విప్పి చూస్తే, అతని పొట్ట నుంచి ఒక ఇనపరోకలి బయటికి వస్తూ కనపడింది. వాళ్ళు దాన్ని బయటికి తీసి, "ఎంత పాపిష్ఠి పని చేశాం! ఈ సంగతి తెలిస్తే యాదవులందరూ ఏమంటారో?" అని భయ





మరికొన్ని చేపలతో సహా దొరికింది. ఆ జాలరి ఆ చేప కడుపులో కనిపించిన ఇనప ముక్కను తీసుకుని, ఒక బాణానికి ములికిగా ఉపయోగించుకోవటానికి ఒక వేటగాడికి ఇచ్చాడు.

ఈ విధంగా యాదవ వినాశనానికి తగిన ఏర్పాట్లు పూర్తి అయాయి.

తరవాత కొంత కాలానికి ద్వారకలో ఉత్పాతాలు కనిపించాయి. అప్పుడు కృష్ణుడు సుధర్మ సభాభవనంలో యాదవులందరినీ సమావేశపరచి, వారితో ఇలా అన్నాడు:

"అయ్యా, ద్వారకలో మహా దారుణమైన ఉత్పాతాలు కానవస్తున్నాయి. ఇవి కీడును సూచిస్తున్నాయి. మునులు యాదవ వంశాన్ని శపించిన సంగతి మీకు తెలిసినదే. అందుచేత మనం ఒక్క క్షణం కూడా ఈ ద్వారకలో ఉండటం మంచిది కాదు. స్త్రీలనూ, పిల్లలనూ, వృద్ధులనూ శంఖద్వారానికి పంపేద్దాం. మిగిలిన వాళ్ళ మందరమూ సరస్వతీ నదీ తీరాన గల ప్రభాసతీర్థానికి వెళ్ళి, అక్కడ స్నానాలూ, ఉపవాసాలూ చేసి, దేవపూజ చేసి, బ్రాహ్మణులకు గోవులనూ, బంగారాన్నీ, వస్త్రాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, గృహాలనూ దానం చేద్దాం. వారిచేత శాంతికర్మలు చేయింతాం.

పడుతూ ఉగ్రసేనుడి వద్దకు పోయి, జరిగినదంతా ఆయనకు చెప్పారు.

ముసలం గురించీ, మునుల శాపం గురించీ యాదవుల కందరికీ తెలిసింది. వాళ్ళు ఆశ్చర్యపోయారు, భయపడ్డారు కూడా. ఉగ్రసేనుడు యాదవులతో, ఆ ముసలాన్ని అరగదీసి, దాని పొడిని సముద్రంలో కలపమన్నాడు. యాదవులు అలాగే చేశారు. ఆ పొడి సముద్రపు అలల తాకిడికి ఒడ్డుకు కొట్టుకువచ్చి, అక్కడ తుంగ రూపంలో మొలిచింది. ముసలాన్ని అరగదీయగా చివరకు మిగిలిన సన్నని ముక్కను ఒక చేప మింగింది. ఆ చేప ఒక జాలరి వాడికి

దేవతలనూ, బ్రాహ్మణులనూ, గోవులనూ పూజిస్తే అన్ని అరిష్టాలూ తొలగిపోగలవు. మనకు శుభం కలుగుతుంది.''

యాదవ ముఖ్యులందరూ కృష్ణుడు చెప్పిన దాన్ని ఆమోదించారు. స్త్రీలనూ, పిల్లలనూ, వృద్ధులనూ పంపేసి, యాదవులందరూ ఓడల మీద సముద్రాన్ని దాటి ప్రభాసతీర్థాన్ని చేరుకున్నారు. కాని అక్కడ వారిని దైవమాయ ఆవరించింది. అందరూ కల్లుతాగి, ఆ మైకంలో కొట్లాటలకు దిగారు. అది తీవ్రమైన యుద్ధంగా పరిణమించింది. ఆ యుద్ధంలో ఏనుగులూ, గుర్రాలూ చచ్చాయి. రథాలు విరిగాయి. ప్రముఖ యాదవుల మధ్య ద్వంద్వ యుద్ధాలు సాగాయి. ప్రద్యుమ్నుడూ, సాంబుడూ పోరాడారు. అలాగే అక్రూరుడు భోజుడితోనూ, అనిరుద్ధుడు సాత్యకితోనూ, సుభద్రుడు సంగ్రామజితుతోనూ, సుచారుడు గదుడితోనూ, సుమిత్రుడు సురథుడితోనూ యుద్ధాలు సాగించారు. ఇదే విధంగా మిగతావారంతా కొట్లాటలకు తలపడ్డారు. బంధుభావమూ, మిత్రభావమూ లేకుండా పోయాయి. వెర్రెత్తిన వారిలాగా ఒకరినొకరు చంపుకోసాగారు.

కొంతసేపటికి బాణాలన్నీ అయిపోయాయి. విల్లులన్నీ విరిగిపోయాయి. మరి ఆయుధాలు లేవు. సముద్ర తీరాన ఏపుగా పెరిగిన తుంగ ఉన్నది. దాన్ని పీకి, దానితో ఒకరినొకరు చంపుకోసాగారు. కృష్ణుడు వారిని ఆపాలని చూశాడు.





పాదం పెట్టి కూర్చున్నాడు. ఎర్రని ఆ ఎడమ పాదాన్ని చూసి, అదేదో జంతువు ముఖమనుకుని, జరు డనే వేటగాడు దాన్ని బాణంతో కొట్టాడు. ఆ బాణం ములికి ముసలాన్ని యాదవులు అరగ దీయగా మిగిలినదే!

బాణం వేసి పరిగెత్తుకుంటూ వచ్చిన ఆ వేటగాడు, తాను మృగమనుకున్నది మనిషి పాదమని తెలుసుకుని, కృష్ణుడితో, "అయ్యా, పొరపాటు జరిగిపోయింది, నన్ను క్షమించు," అన్నాడు.

కృష్ణుడు జరుడితో, "విచారించకు, నేను కోరుకున్నదే జరిగింది," అని వాణ్ణి పంపేశాడు.

వాళ్ళు అలిగి, బలరాముడి మీదా, కృష్ణుడి మీదా కలియబడ్డారు. కృష్ణుడికి మండిపోయింది. అతనే ఆ తుంగ పీకి, దానితో యాదవులను ఎడాపెడా చంపేశాడు. మునుల శాపం, కార్చిచ్చు వెదుళ్ళను కాల్చినట్టుగా, యాదవ వంశాన్ని నిర్మూలించింది.

అందరూ చచ్చారు. కృష్ణుడు అంతటా కలయజూసి, "భూభారంతగ్గిపోయింది," అనుకున్నాడు.

బలరాముడు సముద్ర తీరాన యోగ సమాధిలో కూర్చుని ప్రాణాలు వదిలాడు. అది కళ్ళారా చూసి కృష్ణుడు ఒక రావి చెట్టు మొదట్లో, కుడి తొడ మీద ఎడమ

ఈలోపల దారుకుడు రథంలో, కృష్ణుణ్ణి వెతుక్కుంటూ అటు వచ్చి, కృష్ణుణ్ణి చూసి, రథం దిగి దగ్గిరికి వచ్చాడు. కృష్ణుడు దారుకుడితో, "నువు ద్వారకకు వెళ్ళి, మనవాళ్ళతో అందరూ చచ్చారనీ, బలరాముడు పోయాడనీ, నేను ఈ స్థితిలో ఉన్నాననీ చెప్పు. మీ రెవరూ ఇంక ద్వారకలో ఉండకండి. నేను పోయాక సముద్రుడు దాన్ని ముంచేస్తాడు. నా తల్లి దండ్రులూ, మిగిలినవాళ్లూ ఇంద్రప్రస్థానికి వెళ్ళి, అర్జునుడి అండన ఉంటారు. నువు జరిగినదాన్ని గురించి నిర్లిప్తంగా జ్ఞాననిష్ఠలో బతుకు," అని చెప్పాడు.

దారుకుడు కృష్ణుడికి ప్రదక్షిణం చేసి, చిన్నబోయిన మనసుతో ద్వారకకు వెళ్ళిపోయాడు. అక్కడికి చేరి అతను ఏడుస్తూ ఉగ్రసేనుడి కాళ్ళమీదా, వసుదేవుడి కాళ్ళమీదా పడి, యాదవులంతా చచ్చిపోయిన సంగతి తెలియజేశాడు. అందరూ గుండెలు బాదుకుంటూ యాదవులు చచ్చిన చోటికి వెళ్ళారు. వసుదేవుడూ, దేవకీ, రోహిణీ తమ కొడుకులైన బలరామ కృష్ణుల కోసం ఎంతో వెతికారు. కాని వాళ్ళ శరీరాలు కనిపించలేదు. ఆ ముగ్గురూ గుండెలు పగిలి అక్కడే ప్రాణాలు విడిచారు.

యాదవుల భార్యలందరూ తమ తమ భర్తలతో సహగమనంచేశారు. బలరాముడి భార్యలు కూడా బలరాముడి చితి మీదనే కాలిపోయారు. వసుదేవుడి భార్యలూ, కృష్ణుడి భార్యలూ కూడా అలాగే చేశారు.

అర్జునుడు వచ్చి, చచ్చిపోయిన బంధుగణానికి ఉత్తరక్రియలు చేయించాడు. అదే సమయంలో ద్వారకానగరం సముద్రంలో మునిగిపోయింది. నగరంలో ఉన్న దేవాలయం ఒక్కటి మాత్రం నీటి మీద కనబడుతూ నిలిచింది.

అర్జునుడు, చావగా మిగిలిన స్త్రీలనూ, బాలలనూ, వృద్ధులనూ వెంటబెట్టుకుని ఇంద్రప్రస్థానికి వచ్చి, వజ్రుడికి పట్టాభిషేకం చేశాడు. అటు తరవాత పాండవులు ద్రౌపదితో సహా మహాప్రస్థానం వెళ్ళారు.

కృష్ణుడు నిర్యాణం చెందే సమయంలో అక్కడికి బ్రహ్మ, ఇంద్రుడూ, తదితర దేవతలూ, ప్రజాపతులూ, సిద్ధులూ, విద్యాధరులూ, గంధర్వులూ, అప్సరలూ వచ్చారు. ఆకాశమంతా వారి విమానాలతో నిండిపోయింది. విమానాల నుంచి పుష్పవర్షం కురిసింది. కృష్ణుడు దివ్యమైన విష్ణురూపం ధరించి, తనను చూడవచ్చిన వారినందరినీ గంభీరంగా ఒకసారిచూసి, సత్యమూ, ధర్మమూ, ధృతీ, శ్రీ, కీర్తి తన వెంటరాగా, వైకుంఠానికి బయలుదేరాడు. —(అయిపోయింది)





# యుక్తిగల మంత్రి

పూర్వం అరేబియాలో ఒక సుల్తానుండేవాడు. ఆయన పరిపాలనపట్ల అశ్రద్ధగలవాడై, ఎంతసేపూ తన స్వంత సుఖాలలో నిమగ్నుడై ఉండటంవల్ల రాజ్యమంతా దుస్థితికి వచ్చింది.

అధికారులు సోమరులైపోయారు. వృత్తి వ్యవసాయాలు నశించినై. ప్రజల జీవితం కళాకాంతులు లేకుండాపోయింది.

సుల్తాన్‌గారివద్ద చాలామంది మంత్రులుండేవారు. వారిలో కొందరు సుల్తాన్‌లాగే సుఖాలలో మునిగిపోయారు. మిగిలినవారికి రాజ్యం పాడైపోతున్నదని విచారం ఉన్నప్పటికీ, ఏమైనా చెబితే సుల్తాన్ ఆగ్రహిస్తాడేమోనని భయపడ్డారు.

ఆఖరుకు మంత్రులలో ఒకడు సుల్తానుకు హెచ్చరిక చేయటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. ఆయన ఒకనాటి సాయంకాలం సుల్తాన్ వెంట తోట షికారుకు వెళ్ళాడు. చీకటిపడి వారు తిరిగి వచ్చే సమయంలో వారికి గుడ్లగూబల అరుపులు వినిపించాయి. అది వినగానే మంత్రి ఆగి, శ్రద్ధగా ఆలకించసాగాడు.

''ఏమిటి వింటున్నావు?'' అని సుల్తాన్ ఆశ్చర్యంగా అడిగాడు.

''రెండు గుడ్లగూబలు మాట్లాడుకుంటున్నాయి, మహారాజా, వాటి సంభాషణ వింటున్నాను,'' అన్నాడు మంత్రి.

''నీకు గుడ్లగూబల భాష తెలుసునా ఏమిటి?'' అన్నాడు సుల్తాన్.

''చిత్తం, మహాప్రభూ!'' అంటూ మంత్రి కొంతసేపు ఆలకించి, ''వీటి సంభాషణ ఇంక వినలేను! నా చెవులలో సీసం కరిగించిపోసినట్టుగా వుంది; పదండి మహారాజా!'' అన్నాడు.

అరేబియా జానపద కథ

''అవి ఏ విషయం మాట్లాడుకుంటున్నాయేమిటి ?'' అని అడిగాడు సుల్తాన్.

''ఎందు కడుగుతారు, మహారాజా ? బుద్ధి లేని పక్షులు! వాటి మాటలను లక్ష్యపెట్టవలిసిన పనిలేదు,'' అన్నాడు మంత్రి.

''అవి అడే బుద్ధిలేని మాటలు నాకు కూడా చెప్పరాదా ?'' అన్నాడు సుల్తాన్.

''నేనే వినలేని ఘోరమైన అబద్ధాలు విని సహించగలరా ?'' అన్నాడు మంత్రి.

''అంతగా అయితే గుడ్లగూబలను దండించుదాం. అవి అన్నమాట లేమిటో చెప్పు త్వరగా,'' అన్నాడు సుల్తాన్.

''అయితే వినండి: ఆ గుడ్లగూబలు వియ్యమందుదా మనుకుంటున్నాయి. ఆడగుడ్లగూబ తల్లిని మగదాని తల్లి కట్నం అడుగుతున్నది—తన కొడుక్కు యాభై పాడుబడిన గ్రామాలిమ్మంటున్నది. కావలిస్తే అయిదు వందల గ్రామాలిస్తానంటున్నది ఆడదాని తల్లి. పాడుబడిన గ్రామాలు అయిదు వందలు నీకెక్కడివని మగదానితల్లి అడుగుతున్నది. సుల్తాన్ వారి చల్లని పరిపాలనలో పాడుబడిన గ్రామాలకు కొదువే లేదంటున్నది, ఆడ గుడ్లగూబ తల్లి,'' అన్నాడు మంత్రి.

సుల్తాన్ మరి నోరెత్తలేదు. రాజ్యం భ్రష్టయిపోతున్నదని మంత్రి తనకు తెలియజేయటానికై ఇదంతా కల్పించాడని సుల్తాన్ గ్రహించాడు.

ఇద్దరూ కొంతదూరం నడిచినాక మంత్రి, ''ఇటువంటి అపవాదు వేసిన పాపిని దండించమని సెలవా, మహారాజా ?'' అన్నాడు.

''ఉన్నమాట అన్నందుకు దండన దేనికి ? నిన్ను ప్రధానమంత్రిగా వేస్తున్నాను. ఆ మగగుడ్లగూబకు కట్నం పుట్టకుండా చూడు !'' అన్నాడు సుల్తాన్.

మర్నాటినుంచీ సుల్తాన్‌లో పెద్ద మార్పు కలిగింది. ఆయన తన భోగాలను కట్టిపెట్టి రాచకార్యాలు శ్రద్ధగా చూడసాగాడు. వ్యవసాయమూ, వివిధ వృత్తులూ వృద్ధి చెంది, రాజ్యం త్వరలోనే బాగుపడింది.





# తలుపుగడియ

వీరభద్రం అనే గృహస్థు స్నానాల గదికి వెళ్ళి, తలుపు మూసి గడియ వేసి స్నానం చేశాక తలుపు తీద్దామనుకునేసరికి, గడియ ఊడి రాలేదు. అది వేసినచోటే గట్టిగా బిగుసుకుపోయింది. అదృష్టవశాత్తూ ఆయనకు స్నానాలగదిలో ఒక మూలగా సుత్తి ఒకటి కనిపించింది. ఆయన దానితో బలంగా నాలుగు దెబ్బలు వేశాక గడియ ఊడి వచ్చింది.

ఆయన బయటికి వచ్చి భార్యాబిడ్డలతో, "స్నానాల గది తలుపు గడియ బిగుసుకుపోయింది. వేసేటప్పుడు సులభంగానే వుండి, తీయబోయేటప్పుడు ఇబ్బంది గలిగిస్తున్నది. సుత్తి ఉపయోగించినా గడియ తీయడం, నాకే ఎంతో కష్టమయింది. మీ సంగతివేరే చెప్పాలా? అందువల్ల, బాగు చేయించేదాకా, మీరెవ్వరూ స్నానాల గది తలుపు వేసుకోకండి." అని చెప్పాడు.

ఇది విని వీరభద్రం చిన్నకొడుకు వడ్రంగి ఇంటికి పరుగుపెట్టాడు. వడ్రంగి పని మీద పొరుగూరు వెళ్ళాడనీ, వారం రోజులదాకా తిరిగిరాడనీ తెలిసింది.

అలవాటు మానుకోవడం అంత సులభం కాదు! వీరభద్రం పెద్దకొడుకు పొరబాటున తలుపుగడియ వేసి, తిరిగి తెరవడానికి అరగంటసేపు అవస్థపడ్డాడు. అప్పుడు వాడికి వళ్ళంతా చెమటలు పట్టడంవల్ల, తలుపుగడియ వేసుకోకుండా మరొకసారి స్నానం చేశాడు. అప్పటి నుంచి ఇంట్లోవాళ్ళంతా తలుపుగడియ విషయంలో జాగ్రత్తగా వుండసాగారు.

ఇది జరిగిన నాలుగు రోజులకు వీరభద్రం ఇంటికి, రామచంద్రం అనే బంధువు వచ్చాడు. ఆయన సన్నగా, గాలికి ఎగిరిపోతాడా అన్నట్లుంటాడు. ఇంట్లో అడుగుపెడుతూనే ఆయన,

"వసుంధర"



"బయట ఎండ నిప్పులు చెరుగుతున్నది. ముందు స్నానం చేస్తేగానీ, మాట కూడా ఆడలేదు," అంటూ స్నానాల గదిలోకి వెళ్ళాడు. ఆ వెనువెంటనే తలుపు గడియ వేసుకున్న చప్పుడు కూడా వినిపించింది.

ఆ చప్పుడు వింటూనే వీరభద్రం కంగారుపడ్డాడు. స్నానాల గది తలుపు గడియ వేయవద్దని బంధువును ముందుగా హెచ్చరించడం మరిచిపోయాడు. ఇప్పుడాయన గది నుంచి బయటపడలేక పోతే, తలుపు బద్దలు కొట్టవలసి వస్తుంది!

"ఎందుకైనా మంచిది. సుత్తి గది లోపలే వున్నది కాబట్టి ముందుగా ఆయన్ని హెచ్చరిద్దాం," అన్నాడు వీరభద్రం.

"తలుపు గడియ రాకపోతే, ఆయనే కేక పెడతాడు. ముందే ఆయన్ని కంగారు పెట్టడమెందుకు?" అని వారించింది వీరభద్రం భార్య.

వీళ్ళు విషయమై కలవరపడుతూండగానే, స్నానాలగది లోపలి నుంచి మళ్ళీ గడియచప్పుడైంది. తలుపు తీసుకుని రామచంద్రం బయటికి వచ్చి, "హమ్మయ్య! ఇప్పుడు ప్రాణం తెరిపినపడింది," అన్నాడు.

వీరభద్రం కుటుంబానికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళందరూ తన కేసి ఆశ్చర్యంగా చూస్తూంటే, రామచంద్రం, "అదేమిటి? స్నానాల గది ముందు చేరి అంతా నన్ను దయ్యాన్ని చూసినట్టు చూస్తున్నారు?" అన్నాడు.

"అబ్బే, అదేం లేదు. స్నానం చేయడంలో నీకే యిబ్బందీ కలగలేదు కదా?" అన్నాడు వీరభద్రం తడబడుతూ.

"ఎవరైనా ప్రయాణం యిబ్బందుల గురించి అడుగుతారు. నువ్వు స్నానం యిబ్బంది గురించి అడుగుతావేమిటి? అయినా స్నానం చేయడంలో యిబ్బందేముంటుందీ?" అని ప్రశ్నించాడు రామచంద్రం ఆశ్చర్యంగా.

ఆ ప్రశ్నతో తన పొరబాటు తెలిసి, వీరభద్రం ఇంకేమీ మాట్లాడలేదు.

తలుపుగడియ దానంతటదే బాగుపడిందేమోనని మాత్రం ఆయన మనసులో అనుకున్నాడు. ఆ రాత్రి వీరభద్రం స్నానం చేసేటప్పుడు తలుపు గడియ వేశాడు. కానీ తీయడానికి చాలా శ్రమపడసాగాడు.

రామచంద్రం స్నానాల గది దగ్గిరకు పోయి, "లోపలి నుంచి సుత్తి చప్పుళ్ళేమిట్రా, వీరభద్రం? ఇంతకూ నువ్వు లోపల ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

అతికష్టం మీద వీరభద్రం తలుపు తీసుకుని బయటకు వచ్చి, "స్నానాల గది తలుపుగడియ బిగుసుకుపోయింది. బాగు చేయిద్దామంటే వడ్రంగి ఊళ్ళో లేడు. తీయడం కష్టంగా వుందని గడియ వేసుకోకుండానే స్నానాలు చేస్తున్నాం. నాలుగు రోజుల నుంచి. మధ్యాహ్నం నువ్వు సులభంగా గడియ వేసుకుని తీసేసరికి, అది బాగుపడిందేమో అనుకున్నాను. అది నీ అదృష్టమో లేక నువ్వు ఒక్కగా కనబడుతున్నా బలంఎక్కువేనాకు అంతు బట్టడం లేదు. నాకు మాత్రం గడియ తీయడం యింకా కష్టంగానే వున్నది," అన్నాడు చిన్నబోయిన ముఖంతో.

"అదా సంగతి!" అని రామచంద్రం అదే పనిగా నవ్వసాగాడు.

"ఎందుకలా నవ్వుతావు? సంగతేమిటో చెప్పు," అన్నాడు వీరభద్రం.

రామచంద్రం నవ్వాపి, "నేను ఒక్క ప్రాణినిగదా! మా ఇంట్లో అంతా నన్ను వేళాకోళం చేస్తూంటారు. మా స్నానాల గది గడియ కూడా కాస్త బిగువే. ఇంట్లో అందరికీ సులభంగానే వుంటుంది కానీ—నాకది వెయ్యడమూ, తీయడమూ కూడా కష్టమే! గడియ కూడా వేసుకోలేదని అంతా నన్ను ఆట పట్టిస్తారని భయపడి, స్నానానికి వెళ్ళినప్పుడల్లా తలుపు మూసి గడియ వేసినట్టు చప్పుడు చేస్తాను. అదే అలవాటై పోయింది. మధ్యాహ్నం యిక్కడా అదే పని చేశాను," అన్నాడు.

ఇది విన్న వీరభద్రం కుటుంబం వాళ్ళు చాలాసేపు రామచంద్రంతోపాటు పెద్దగా నవ్వుకున్నారు.






# బీదవాడి అదృష్టం

ఒక ఊళ్ళో ఒక రైతు ఉండేవాడు. అతనూ, అతని భార్యా ఎంతో ధర్మబుద్ధి గలవాళ్ళు. అయితే వారికి గంపెడు పిల్లలుండటంచేత, భార్యాభర్త లిద్దరూ ఒళ్ళు విరుచుకుని పనిచేసినా అందరి పొట్టలూ నిండటానికి గంజి తప్ప మరేమీ ఉండేది కాదు. ఏ పూట అయినా సంకటి తింటే ఆ పూట వారికి విందే.

ఇంతగా తిండికి కటకట పడుతున్నా, ఆ రైతు దంపతులు ఆకలిగొని వచ్చిన వారికి ఎన్నడూ లేదని ఎరగరు. తాము తాగే గంజిలోనే అతిథికి కూడా ఎంతో ప్రేమగా ఇంత పోసేవారు.

ఒకనాడు వాళ్ళందరూ భోజనానికి కూచున్న సమయంలో ఒక బికారివాడు ఆకలితో మలమల లాడుతూ వచ్చాడు. రైతూ, అతని భార్యా తాము తాగబోతున్న గంజిలో నుంచి సగం సగం తీసి ఆ బికారి వాడికి పోశారు. కొసప్రాణంతో ఉన్నట్టు కనిపించిన ఆ బికారి ఆ గంజి తాగి అమృతం తాగినవాడిలాగా కోలుకున్నాడు. వాడి ముఖానికి ఒక కళ వచ్చింది. వాడు రైతుతో, ''మీ దంపతుల వంటి పుణ్యాత్ములను నే నెక్కడా చూడలేదు. మీరు గంజి చేసుకునే చట్టి ఇలా పట్టుకురండి, దానిని అక్షయపాత్రగా మారుస్తాను,'' అన్నాడు.

రైతు భార్య తమ చట్టిని తెచ్చి బికారి కిచ్చింది. వాడు దాన్ని చేతబట్టుకుని కొంతసేపు ఏదో మంత్రాలు చదివి, దానిపై మూకుడు ఉంచి, ''ఇక మీరు తిండికి వాచిపోనవసరం లేదు. రాజుగారి వంట సాలలో తయారయే ప్రతి వంటకమూ ఈ చట్టిలో మీకు దొరుకుతుంది,'' అని చెప్పి ఆ క్షణంలోనే తేచి తిన్నగా బయటికి వెళ్ళిపోయాడు.

రైతు దంపతులు ఈ బికారి వాడి మాటలు నమ్మలేదుగాని, వాటిని ఒక ఆశీర్వాదంగా మటుకు భావించారు. అయితే ఆ రాత్రి, రైతు భార్య గంజి కాయటానికి చట్టి మీది మూకుడు ఎత్తే సరికి, కమ్మని వాసనలు వెదజల్లుతూ చట్టి నిండుగా రకరకాల వంటకా లున్నాయి. అందరూ ఎక్కువెక్కువగా తిన్నప్పటికీ అవి ఏమాత్రం తరగలేదు. అది నిజంగా రాజభోజనమే.



అది మొదలు రైతు దంపతులూ, వాళ్ళ పిల్లలూ ఆ చట్టి ధర్మాన తాము రాజభోజనాలు చెయ్యటమే గాక తమ ఇంటికి వచ్చిన అతిథులకు కూడా అదే భోజనం పెడుతూ వచ్చారు. రైతు తన ఇంటికి వచ్చిన అతిథులతో, "అయ్యా, నేను పెట్టేది తినండిగాని, దాన్ని గురించి నన్ను ఎలాటి ప్రశ్నలూ వెయ్యకండి," అని వేడుకునేవాడు.

అతని ఇంట భోజనం చేసినవాళ్ళు ఇతర చోట్లకు వెళ్ళి, "ఫలాని రైతు పెట్టిన భోజనమే భోజనం! మహారాజులకు తప్ప అటువంటి భోజనం దొరకదు!" అని చెప్పుకునేవాళ్ళు.

రైతు ఇంట ఈవిధంగా జరుగుతూంటే, అవతల రాజుగారి ఇంట వంటకాలు తరిగిపోతూండటం జరిగింది. ఈ సంగతి మొట్టమొదటగా రాజుగారి వంటవాడు గమనించాడు. వాడు రాజకుటుంబానికి కావలిసిన దానికంటె ఎక్కువగానే వండినప్పటికీ, ఒక్కొక్కసారి వంటకాలు చాలీచాలకుండా ఉండేది. గిన్నెనిండా పాయసం తయారుచేసి మూతపెడితే వడ్డించే సమయానికి గిన్నెలో పాయసం వెలితిగా ఉండేది. ప్రతిపూటా ఇదే జరుగుతూ ఉండటంచేత వంటవాడు ఇదేదో దొంగ చేస్తున్నపని అనుకున్నాడు. అయితే ఆ దొంగ ఎవడో వాడికి తెలియ లేదు.

చివరకు వాడు జరుగుతున్న వింతను గురించి రాజుగారికి విన్నవించుకున్నాడు.



రాజుగారు మొదట వాడి మాటలు నమ్మ లేదు. తరవాత, ఆయన ఒకనాడు స్వయంగా పరీక్షించి వంట పాత్రలలోని వంటకాలు తరిగిపోతూ ఉండటం గమనించాడు.

రాజు ఈ విషయాన్ని మంత్రితో చెప్పాడు. మంత్రి కూడా స్వయంగా పరీక్షించి, వంటకాలు తరిగిపోతున్నాయని రూఢి చేసుకున్నాడు. రాజుగారి ఇంటి రహస్యం గుట్టుగా ఉండదు. ప్రతిపూటా రాజుగారింటి వంటకా లెవరో ఎత్తుకుపోతున్నారనే వార్త ఊరంతా పాకింది. ఇంకో వేపునుంచి రైతు ఇంట రోజూ రాజభోజనం చేస్తారన్న వార్త కూడా పాకింది. ఈ రెండు పుకార్లూ కలుపుకుని అర్థం చేసుకున్నవారికి, రాజుగారింట మాయమయే వంటకాలు, ఎలాగో రైతు ఇంటికి చేరుతున్నాయి అన్న అనుమానం తల ఎత్తింది. త్వరలోనే ఈ అనుమానం రాజుదాకానూ, మంత్రిదాకానూ వెళ్ళింది.

"అసంభవం! నేను విచారించాను. ఈ రైతు ఊరి చివర ఒక గుడిసెలో ఉంటున్నాడు. చాలా పేదవాడు. కాని దేవుడిలాటి వాడని చెప్పుకుంటారు. ఏమైనా వాడు ప్రతిపూటా మన దివాణానికి వచ్చి వంటకాలు మాత్రమే దొంగలించుకుపోతున్నాడంటే అది నమ్మరాని విషయం. అంత రహస్యంగా రాజభవనంలోకి రాగల వాడు ఎంత విలువైన వస్తువునన్నా ఎత్తుకుపోయి సుఖంగా బతకవచ్చు. పూటపూటా దొంగతనానికి రావటమంటే మాటలా?" అన్నాడు మంత్రి.

"అయినా మనం వెళ్ళి ఒక పూట వాడి ఇంటి తిండి తింటే నిజం తెలిసిపోతుంది. వాడు ఇంటికి వచ్చిన అతిథికి లేదనడుట," అన్నాడు రాజు.

సరే, రాజూ, మంత్రీ మామూలు దుస్తులు ధరించి, పెద్ద పెద్ద తలపాగాలు చుట్టి, చేతికర్రలు పట్టుకుని ఎవరికీ తెలియకుండా కాలినడకను రైతు ఉండే ఇంటికేసి బయలుదేరారు. బయలుదేరే

ముందు వారు రాజుగారింట ఏమేమి కూరలూ, పాయసాలూ అవుతున్నాయో వంటవాణ్ణి అడిగి తెలుసుకున్నారు.

అక్కడ రైతు ఇంట రైతు కుటుంబం వారంతా భోజనాలకు కూచోబోతుండగా ఇద్దరు ఆజానుబాహులు వచ్చి, "అయ్యా, మేం పొరుగూరి వాళ్ళం. ఎండపడి వచ్చాం. ఈ పూటకు కాస్త భోజనం పెట్టించగలరా ?" అని అడిగారు.

రైతు లేచి వారిని ఎంతో ప్రేమతో ఆహ్వానించి, వారికి కూడా ఆకులు వేయించి భార్యచేత వడ్డన చేయిస్తూ, "అయ్యలారా, నేను పెట్టినది తిని వెళ్ళండి. దయచేసి నన్నేమీ ప్రశ్నలు వెయ్యవద్దు !" అన్నాడు.

ఆకులలో వడ్డన అవుతుండగానే అవి రాజుగారి వంటసాలలో చేసిన వంటకాలని, మారువేషంలో ఉన్న రాజుకూ, మంత్రికీ తెలిసిపోయింది. వాళ్ళు భోజనం చెయ్యటానికి వచ్చినవారు కారు గనక, రైతుతో, "శ్రీమంతులకు కూడా సాధ్యం కాని ఈ భోజనం నీకెట్లా దొరికింది ?" అని అడిగారు.

"దయచేసి నన్నేమీ అడక్కండి," అన్నాడు రైతు.

"చెబితేనేగాని మేము ముద్ద ఎత్తేది లేదు," అన్నారు అతిథులు.



విధిలేక రైతు జరిగినదంతా చెప్పాడు. రాజుగారికి అంతా వినేసరికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన చివాలున లేచి తన చేతికర్రతో రైతు చట్టి పగలగొట్టి మంత్రిని వెంటబెట్టుకుని మారు మాట లేకుండా వెళ్ళిపోయాడు.

రైతు భార్య చట్టిపెంకులు తడువుతూ పట్టరాని దుఃఖంతో కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది.

"ఊరుకోవే! మనం ఎప్పుడూ రాజభోజనమే చేశామా ఏమిటి? ఇవాళతో మనకు భోజన సుఖం పూర్తి అయింది. మన కలో, గంజో మనకుండనే ఉంది," అని భర్త ఆమెను ఓదార్చాడు.

రైతు కుటుంబం చట్టి పగలగొట్టేసి ఇంటికి తిరిగి వెళ్ళిన రాజుకూ, మంత్రికీ ఆ పూట భోజనం లేకుండా పోయింది.

''మహారాజా, వంటకాలు పొయిమీద పాత్రల్లో ఉండగానే మాయమవుతున్నాయి. కావలిస్తే పాత్రలుచూడండి— బయట అంతా మసి, లోపల తోమినట్టు ఎలా ఉన్నాయో! ఒక్కొక్క పాత్ర అరేసిసార్లు కూరలతో నించి పొయిమీద పెట్టాను. క్షణంలో ఖాళీ అయిపోతున్నాయి!'' అన్నాడు వంటవాడు.

రాజుగారు రైతు ఇంట భోజనం చేసి వచ్చిన వాడైనా కాడు. మంత్రి తన ఇంటి నుంచి రాజకుటుంబానికి భోజనం పంపాడు. కాని రాజుగారిల్లు చేరేసరికి ఆ వంటకాలు కూడా మాయమయాయి.

తాను చేసిన అన్యాయం కట్టికుడుపుతున్నదని రాజుకు తెలిసివచ్చింది. ఆయన మంత్రితో సహా రైతు ఇంటికి వెళ్ళి, రైతు కాళ్ళపైపడి, ''నేను కోపావేశంలో చేసిన దుర్మార్గాన్ని క్షమించాలి. మీ చట్టి పగలగొట్టినందుకు పరిహారంగా పెద్ద మాన్యం ఇస్తాను. ఇకనుంచీ మా వంట సాలే మీ వంటసాల. రోజూ మా ఇంట చేసే వంటకాలలో సగం మీ ఇంటికి పంపుతాను. నన్నూ, నా కుటుంబాన్నీ తిండికి మాడ్చి చంపితే మీకేం లాభం?'' అని ప్రాధేయపడ్డాడు.

రైతు కంగారుపడి, ''అయ్యా, నేను మీకేమీ చెయ్యలేదు. చట్టి పగిలిందని నా భార్య ఏడుస్తుంటే గంజి తాగి బతుకుదాం లెమ్మని చెప్పాను. మీకు అన్యాయం జరిగితే అది నావల్ల జరగలేదు. మిమ్మల్ని క్షమిస్తే, నాకు చట్టి ఇచ్చిన మహానుభావుడే క్షమించాలి,'' అన్నాడు.

తన వంటలో సగం రైతుకిస్తానన్నాక రాజుగారి వంటసాలలో చేసిన వంటకాలు చేసినట్టున్నాయి. రైతు, రాజుగారిచ్చిన మాన్యంతో సుఖంగా జీవిస్తున్నప్పటికీ వారికి రాజభోజనం పూట పూట వస్తూనే ఉండేది. ఆ విధంగా ఆ కుటుంబానికి మూడు తరాలపాటు జరిగింది.





## బలమైన తుఫానుగాలి!

అమెరికాలోని న్యూ హాంప్‌షైర్‌లో సముద్రమట్టానికి 6,262 అడుగుల ఎత్తులో మౌంట్ వాషింగ్‌టన్ అబ్సర్వేటరీ ఉన్నది. ఈ వాతావరణ పరిశోధన కేంద్రం రికార్డుల ప్రకారం ఇంతవరకు ప్రపంచంలోకెల్లా అతి వేగంగా తుఫానుగాలులు గంటకు 231 మైళ్ళ వేగంతో 1934 వ సంవత్సరంలోనే వీచాయి!



దక్షిణ ఆఫ్రికాలోని మగ హెర్క్యులస్ బీటిల్ అనే కీటకం ఆరు అంగుళాల పొడవున్నది. దీని శరీరంలో దాదాపు సగం వరకు పొడవైన కొమ్ముల్లాంటి కోరలున్నాయి. ఆడ కీటకాలను ఆకర్షించడానికి ఇవి ఉపయోగపడతాయట!

## హెర్క్యులస్

దక్షిణ ధ్రువానికి 264 మైళ్ళ దూరంలో మాత్రమే భూమిపై జీవం గల మొక్కలు కనిపిస్తాయి. కొండలమీద నాచువంటి లిచెన్ జాతి పూలుపూయని చిన్న చిన్న మొక్కలు ఉన్నాయి.

## దక్షిణప్రాంత మొక్కలు



ఎల్లోరాలోని 8వ శతాబ్దపు శివాలయం—
అది నాన్సీలోని కవిని బయటకు తెస్తుంది

"కాల ప్రవాహపు అలల్లో పయనించే గుసగుసలు"...'దీని గురించి నీ అభిప్రాయం ఏమిటి?

భయంలేని నలుగురు-యూసుఫ్ నాయకుడు-గురుస్వామి తెలివైనవాడు-సాహసకృత్యాలకురికే నాన్సీ, పరమ్ ధైర్యవంతుడు ఎప్పుడూఏదో ఒక కొత్తదనంకోసం ఎదురు చూస్తారు భారతదేశపు అందచందాలంటే అమితప్రేమ.

"........."

గురు. నిన్ను ఒక ప్రశ్న అడిగాను. ఆ వాక్యం ఎలా ఉంది?

"నిశ్శబ్దం" అన్నది వాడి జవాబు, ఎందుకంటే గుసగుసలు చప్పుడు చేయవు కదా!

పరమ్! భలేగా ఉంది. హా... హా...

ఆ అద్భుతమైన రాతి ఏనుగని చూడండి.

వారు రాతిలో మలచిన భారతదేశపు అతిపెద్ద దేవాలయాన్ని పరికిస్తుండగా...

చుట్టూ గదులు గల ఒక పెద్ద హాలు, భిక్షువులు అందులో నివసించి ప్రార్థనలు జరిపేవారు... ఈ ఆలయాన్ని, ఎత్తైన కొండని చెక్కి, నిర్మించారు. 4 లక్షల టన్నుల రాళ్ళని తొలగించారు...

ఎంతమంది పనిచేశారో ఊహించండి.

హో! హో! హో!

"పయనించే గుసగుసలు..." ష్ ష్...! యూసఫ్, విను...






అరె! ఏమిటిది!
పార్టీ చేసుకుంటున్నాం! హా! హా! మాతో చేరతావా!


ఇటువంటి ప్రదేశంలో గూండాతనం? అరవడం?
ఆ చెత్తా చెదారం చూడు.
అసలు మీకెందుకంట? ఇది ఎవరబ్బసొమ్మంట?


అసలు నీ ఉద్దేశ్యం ఏమిటి? ఇది మనందరికీ సంబంధించింది.
నీక్కూడా సంబంధించింది. నీ వారసత్వ సంపదని, చరిత్రని యిలా ఎలా అవమాన పరుస్తున్నావు?


భగవధ్యానంలో ఉన్నవారిని చూశావా? వారిగురించి ఆలోచించు.


చూడండి, మేమంతా యీ సాహస పిల్లలను సమర్థిస్తున్నాం.
మీరు మానకపోతే, మిమ్మల్ని యిక్కడనుంచి గెంటివేస్తాం.


రండి, మిమ్మల్ని ఔరంగాబాద్ తీసుకువెడతా. మీ గురించి విన్నాను. ఇప్పుడు మీ కృషి చూశాను. గొప్పసేవచేస్తున్నారు. మానకండి.
ధన్యవాదాలు, సార్.
మేము స్పృశిస్తాం. మేము రక్షిస్తాం
భారతదేశపు అపురూపమైన అందాలు
మీరుకూడా మనపరిసరాలను అపవిత్రం చేసే బుద్ధిలేనివాళ్ళను ఆపండి మనందరం కలిసి పనిచేస్తే మనదేశపు అందచందాలను శాశ్వతంగా పదిలపరచుకోవచ్చు

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Prasad



A. L. Syed

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నేర్చుకోమంటున్న ప్రోత్సాహం! రెండవ ఫోటో: నెరవేర్చుకుంటున్న ఉత్సాహం!!

పంపినవారు : నడింపల్లి సూర్యనారాయణరాజు, రావిపాడు (ప. గో. జిల్లా)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---